ఫిబ్రవరి 2017

సైన్సు దినోత్సవ శుభాకాంక్షలతో



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.25/-




సంపుటి: 3 సంచిక: 1 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 రూ. ఫిబ్రవరి 2017



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

వీరాంజనేయులు: 7799260684

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక



89 వ పుస్తకం!




---

కేయూరాణి న భూషయంతి పురుషం హారా న చంద్రోజ్జ్వలా :
న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతా మూర్ధజాః ।
వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయంతేఽ ఖిల భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్ ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భూషలుగావు మర్త్యులకు భూరి మయాంగద తార హారముల్
భూషిత కేశ పాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్-
భూషలు గావు; పూరుషుని భూషిత జేయు బవిత్ర వాణి! వా-
గ్భూషణమే సుభూషణము! భూషణముల్ నశియించునన్నియున్!

**భావం:**

మనిషికి అందాన్నిచ్చేవి కడియాలు, మురుగులు, ధగధగలాడే నగలు కాదు. సువాసనలూరే లేపనాలతో స్నానం, పూలతో అలంకరించిన జడలు ఇవేవీ అందాన్నివ్వవు. వ్యక్తికి అందాన్నిచ్చేది, ఆ వ్యక్తి యొక్క సంస్కారవంతమైన మాట తీరే. ఏనాటికీ నిలిచేది వాక్భూషణమే!

# డబ్బుల పర్సు గోల

బడిలో పిల్లలంతా కలిసి మ్యూజియం చూద్దామని వెళ్లారు.

ఆదివారం, ఉదయం పూట వాతావరణం అంతా చల్లగా, హాయిగా ఉంది.

మ్యూజియం బయట చక్కని పచ్చిక బయలు ఉంది. పిల్లలంతా అక్కడ కూర్చున్నారు, వరసలు వరసలుగా. వాళ్లతో పాటు వచ్చిన టీచర్లు కొందరు దగ్గర్లో నిలబడి ముచ్చట్లు పెట్టుకుంటున్నారు. కొందరేమో మ్యూజియం నిర్వాహకులతో మాట్లాడి టిక్కెట్లు తెచ్చేందుకు వెళ్లారు.



ఓ పిల్లాడికి కొంచెం నవ్వుకోవాలనిపించింది. 'ఏం చేద్దాం?' అని చుట్టూ చూశాడు. దగ్గర్లోనే సుధాకర్ సార్ నిలబడి ఉన్నారు; వేరే ఎవరితోనో మాట్లాడుతూన్నారు. ఆయన ప్యాంటు జేబులో ఓ పర్సు- సగం జేబులో ఉంది; మిగిలిన సగం బయటికి వచ్చి ఉంది.

వీడు ఓ కట్టెపుల్ల తీసుకొని, ఆ పర్సును పొడిచాడు, ఊరికే- పర్సు జారి క్రింద పడ్డది!

పర్సు జారిపోవటాన్ని గమనించుకోలేదు సుధాకర్ సారు. తనలోకంలో తను ఉన్నారు.

పిల్లాడు ఒక క్షణం పాటు ఆ పర్సును 'సారుకిద్దామా?' అనుకున్నాడు- కానీ ఇవ్వలేదు. దాన్ని కొంచెం అటు ప్రక్కగా ఉన్న గుబురులోకి తోసాడు. ఆపైన ఏమీ తెలీనట్లు కూర్చున్నాడు.

ఓ పది నిముషాల తర్వాత సుధాకర్ సారు జేబులు తడుముకున్నారు. పర్సులేదు!

ఆ పర్సులో చాలానే డబ్బులుండాలి! వాటికంటే ముఖ్యం, ఆయనకున్న రకరకాల కార్డులు అన్నీ ఉండాలి! అవి లేకపోతే తను బస్సుకూడా ఎక్కలేడు!!

ముందు ఆయన అటూ ఇటూ వెతికి చూసాడు. ఆపైన తోటి టీచర్లను అడిగాడు. టీచర్లేమో పిల్లల్ని అడిగారు. చివరికి అందరు పిల్లలూ ఆ చుట్టుప్రక్కలంతా వెతకటంలో పడ్డారు. సుధాకర్ సార్‌కు చికాకు మొదలైంది. అరవటం మొదలెట్టారు. అంతలోనే మ్యూజియంవాళ్లు తలుపులు తెరిచారు. కొందరు పిల్లలు అటుపరుగెత్తారు. టీచర్లంతా సుధాకర్ సారుకేసి చూసారు. పిల్లల్ని వెనక్కి రమ్మన్నారు.

సుధాకర్ సారేమో గంతులు వేస్తున్నారు -ఉన్నవాళ్లనీ లేనివాళ్లనీ కలిపి తిడుతూ శూన్యంలో వెతుకుతున్నారు. చుట్టూ ఉన్న పిల్లలు వణికిపోతున్నారు. టీచర్లంతా కంగారు పడుతున్నారు. "డబ్బులుపోతే పర్లేదు- కార్డులు పోయినాయే!' అని సానుభూతి వ్యక్తం చేస్తున్నారు "జాగ్రత్తగా ఉండొద్దూ!?" అంటున్నారు. అవి వింటున్నకొద్దీ మరింత రెచ్చిపోయారు సుధాకర్ సారు. "ఎవ్వరూ ఇక్కడి నుండి కదిలేది లేదు. నా పర్సు దొరకాలి! పిల్లలంతా లైనుగా నిలబడండి!" అని అరిచారు.

పర్సుని పొదలోకి నెట్టిన పిల్లాడికి ఇప్పుడు భయం మొదలైంది. "పొదలోనే ఉండాలిగా!? ఎవరికీ ఎందుకు దొరకలేదబ్బా?!" అని మెల్లగా అటువైపు చూసాడు- పొదలో పర్సు లేదు!! వాడికి ప్రాణాలు పోయినంత పనైంది. దాంతో మళ్ళీ అటుకేసి చూడకుండా వేరే దిక్కుకు పోయి, చప్పుడు చేయకుండా బిక్కముఖం పెట్టుకొని కూర్చున్నాడు.

కొద్దిసేపటికి అందరూ లేచి మ్యూజియంలోకి వెళ్లారు. కానీ ఏ ఒక్కరూ అక్కడి అపూర్వ వస్తువుల కేసి కొద్దిసేపైనా చూసిన పాపాన పోలేదు. సుధాకర్ సార్ అరుపులు, ఆక్రోశం, ఆవేశం అన్నీ ఐదారు గంటల పాటు కొనసాగాయి మరి!

సాయంత్రం కావస్తుండగా అంతా బయటికొచ్చారు. టీచర్లు, కొందరు పిల్లలు మళ్లీ ఓసారి అక్కడంతా వెతికారు. అంతకు ముందు ఎందుకు కనిపించలేదో గానీ, ఇప్పుడు అటు చూడగానే కనిపించింది- పొదలో దాక్కున్న పర్సు!

దాన్ని చూడగానే సుధాకర్ సారు ముఖం వెలిగింది. టీచర్లంతా ఊపిరి పీల్చుకున్నారు. పిల్లల నవ్వులు మళ్ళీ కొంచెం కొంచెంగా వినిపించాయి. దీనికంతటికీ కారణమైన పిల్లాడు మాత్రం అందరికంటే గట్టిగా, అందరికంటే సంతోషంగా నవ్వాడు. కానీ ఇదంతా కొద్ది సేపే- ఇళ్ళకు చేరాలిగా, అందరూ ఊపిరి పీల్చుకొని బస్సెక్కేందుకు బయలుదేరారు.

మ్యూజియంలోని అరుదైన బొమ్మలు, పార్కులోని అందమైన పూలచెట్లు మటుకు ఆ రోజంతా తమని వీళ్ళు ఎవ్వరూ పట్టించుకోలేదని ఏడుపు ముఖం పెట్టాయి. 'డబ్బుల పర్సు ఎంతపని చేసింది!' అని కుళ్ళుకున్నాయి.

ప్రతి ఒక్కరికీ రెండు వేల పదిహేడు శుభాకాంక్షలతో-

కొత్తపల్లి బృందం.



కొడుకు: నాన్నా, కుందేలుకి ఎన్ని కాళ్లుంటాయ్?

తండ్రి: నాలుగు.

కొడుకు: కాదు మూడే!

తండ్రి: కాదు రా, కుందేలుకు నాలుగు కాళ్ళుంటాయి.

కొడుకు: కాదు- మూడే ఉంటాయి నాన్నా! నీకు తెలుసా, మా సారుకు తెలుసా చెప్పు?!

తండ్రి: మీ సారు చెప్పారా? ఏమని చెప్పారా?

కొడుకు: 'తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్లు' అని చెప్పారు.



# చిలుక పలుకులు

*రచన: బోయిని అజయ్, పదవ తరగతి, ZPHS, ముస్తాబాద్, కరీంనగర్ జిల్లా.*

అనగనగా మంగపట్నంలో రాఘవయ్య అనే వ్యాపారి ఉండేవాడు. అరటి పండ్ల వ్యాపారం చేసేవాడు అతను. పచ్చి అరటిపళ్ళు తీసుకొచ్చి, వాటిని మహా భయంకరమైన రసాయనంలో ముంచి పెడితే, ఒక్క రాత్రిలో అవి ముచ్చటగొలిపే పసిడి రంగుకు తిరిగేవి. ఈ సంగతి తెలీని అమాయకులు రోజూ రాఘవయ్య అంగడిలో అరటిపళ్ళు కొనుక్కొని పిల్లలకు తినిపిస్తూండేవాళ్ళు.

రంగయ్య దుకాణానికి దగ్గర్లో ఒక పెద్ద జువ్వి చెట్టు ఉండేది. దాని మీద చాలా చిలకలు నివాసం ఉండేవి. దారిన పోయే జనాలు వాటిని చూసి ముచ్చటపడి తమ దగ్గరున్న పప్పులో, కాయలో కొన్ని ఆ చెట్టు మొదట్లో పెట్టి పోతుండేవాళ్ళు. వాటిలో కొన్ని చిలకలు మనుషుల్ని చూసీ చూసీ వాళ్లలాగా మాట్లాడటం కూడా మొదలు పెట్టాయి.

ఒకసారి ఉరుములతో కూడిన పెద్ద వర్షం

కురిసింది. రాఘవయ్య దుకాణం మూసి బయటికి వస్తుంటే చెట్టు క్రింద ఒక రామ చిలుక పడిపోయి కనిపించింది. దానికి బాగా గాయాలు అయి ఉన్నాయి! జాలిపడిన రాఘవయ్య, ఆ రామచిలుకను ఒళ్ళోకి తీసుకొని, కట్టుకట్టి, సపర్యలు చేసాడు.

కొద్ది సేపటికి అది తేరుకున్నది. రాఘవయ్యకు 'థాంక్స్' చెప్పింది. "ఏం జరిగింది?'అని అడిగాడు రాఘవయ్య. "ఎవరో ఒక అతను ఇక్కడే చాలా సేపు తచ్చాడాడు. నాకు అనుమానం వచ్చింది. ఎగిరిపోవాలనుకున్నాను. అంతలోనే అతను నన్ను గులేర్‌తో కొట్టాడు. అది తగిలేసరికి ఇలా కింద పడిపోయాను. అయితే అతనికి నేను ఎక్కడ పడ్డదీ తెలీలేదు. కొంచెంసేపు వెతికి, తిరిగి వెళ్ళిపోయాడు" చెప్పింది చిలుక.

అటు తర్వాత అది రాఘవయ్యకు కొంచెం దగ్గరైంది. రోజూ సాయంత్రం సమయంలో వచ్చి దుకాణంలో కూర్చునేది; రాఘవయ్య ఏమైనా ఇస్తే తినేది; చిన్న చిన్నగా ముచ్చట్లు పెట్టేది. ఒకసారి అది వచ్చే సరికి కొళాయి నుంచి నీళ్ళు చుక్కలు-చుక్కలుగా కారుతున్నాయి. కొంచెం సేపు చూసి, "నీళ్ళు కట్టేయ్! నీళ్ళు కట్టేయ్!" అని అరిచింది చిలుక. రాఘవయ్య కుళాయి కేసి చూసి, "ఏం కాదులే!" అని, తన పని తను చేసుకుంటూ ఉండిపోయాడు.



చిలుకకి నీళ్ళు వృధా అవ్వటం ఇష్టం కాలేదు. 'ఏం చేద్దాం?' అని ఆలోచించింది. 'కడుపులో దాచుకుందాం- వృధాగా పోగొట్టేదెందుకు?'అని వెళ్ళి నీళ్ళు త్రాగటం మొదలు పెట్టింది.

కొద్ది సేపటికే దాని కడుపు నిండేసరికి, ఇక ఏం చేయాలో తోచలేదు. 'ఒంటెనైనా

కాకపోతినే!' అనుకొని, చివరకు ఆ ప్రయత్నం నుండి విరమించుకున్నది.

అయితే అది చూస్తూండగానే నీళ్ల చుక్కలు ఆగాయి: ట్యాంకులో నీళ్ళు అయిపోయాయి. వెంటనే చిలకకు ఒక ఐడియా వచ్చింది. నేలమీద పడి తన్నుకుంటూ "దాహం-దాహం" అని అరవటం మొదలెట్టింది.



రాఘవయ్య గబగబా వచ్చి కుళాయి తిప్పి చూసాడు. నీళ్ళు లేవు! "ట్యాంకులో నీళ్ళు ఐపోయాయి" అని మోటారు వేయబోయాడు. కరెంటు లేదు! దాంతో అతనికి ఇక ఏం చేయాలో తోచలేదు. "కొంచెం ఆగు- వేరే ఎక్కడైనా కాసిని నీళ్ళు దొరుకుతాయేమో చూసి వస్తాను" అని పోబోయాడు.

చిలుక లేచి కూర్చుని, "లేదులే, నాకు దాహం కాలేదు. నీకు బుద్ధి చెప్పడానికి ఇలా చేసాను. కుళాయిలో నీళ్ళు ఊరికే పోతుంటే సమస్య కదా!" అన్నది.

రాఘవయ్యకి కోపం వచ్చింది కానీ, "అది చెప్పింది మంచికే గదా" అని ఊరుకున్నాడు.

తర్వాత కొన్ని రోజులకు రాఘవయ్య కొడుకు, పన్నెండేళ్లవాడు, పట్నం నుండి వచ్చాడు. రాఘవయ్య వాడిని ముద్దు చేస్తూ, తను మామూలుగా అమ్మే అరటిపళ్ళు రెండు తీసి ఇచ్చాడు తినేందుకు. సరిగ్గా అదే సమయానికి ఎగురుకుంటూ వచ్చిన చిలుక వాడి చేతిలోంచి పళ్ళు లాక్కొని, పైకెగిరిపోయి

కూర్చున్నది!

రాఘవయ్యకి కోపం వచ్చి తిట్లు లంకించుకున్నాడు. అతన్ని పూర్తిగా తిట్టనిచ్చి, చిలుక శాంతంగా "చూడు, నువ్వు అమ్మే అరటిపండుని ఒకరోజు తిన్నందుకే నా కడుపులో భరించలేనంతగా మంటగా ఉండింది:



ఇక నువ్వు అమ్మే పళ్లను కొనుక్కొని తినే మనుషులకు ఏమేమి రోగాలు వస్తున్నాయో, వాళ్ళు ఎంత మంటను భరిస్తున్నారో తెలీదు.

పచ్చి కాయల్ని ప్రమాదకర రసాయనాలతో నింపి అమ్ముతున్నావే, వాటివల్ల జనాలకెంత కష్టమో ఆలోచించావా? అట్లా ఆలోచించి ఉంటే నీ కొడుక్కి ఈ పండ్లు పెట్టేవాడివా అసలు?! నేను ఈ పని చేసింది నీ కొడుకు క్షేమం కోసమే!" అన్నది.

ఆ మాటలు విని రాఘవయ్య హృదయం కంపించింది. తన తప్పుకు పశ్చాత్తాప-పడ్డాడు. చిలుకకు క్షమాపణ చెప్పుకొని, అటుపైన నీతిగా వ్యాపారం చేసుకున్నాడు. మంచి పనులు తన తోటే మొదలవ్వాలన్న నిజాన్ని తెలియజెప్పిన చిలుకకు మనస్ఫూర్తిగా ధన్యవాదాలు చెప్పుకున్నాడు.

**చక్రాల మీద!**



సుబ్బారావు: ఏమిట్రా, మీ నాన్న పనిమీద వెళ్ళాడా?

సోము: కాదండి, సైకిలు మీద వెళ్ళాడు.

**అనుమాని**

డాక్టరు: తలనొప్పిగా ఉందా? అయితే ఇవి రెండు మాత్రలు వేసుకోండి.

పేషంటు: నాకున్నది ఒకే తల డాక్టరు గారూ! రెండు మాత్రలు అవసరం లేదేమో?!

-హేమవర్షిణి, ఐదవ తరగతి, వికాస విద్యావనం



# చదువు విలువ

*ఇది చదివాక, "ఎందుకు నెరవేర్చరు? తప్పకుండా నెరవేరుస్తారు!" అని చెప్పాలనిపించింది, మీరేమంటారు?* **రచన : ఇషాక్, సౌజన్యం : శ్రీ కె రామకృష్ణ, ఈ మెయిలు.**

అనగనగా తాడిపత్రిలో రాముడు, నాగలక్ష్మి అనే దంపతులు ఉండేవారు. వాళ్లకు లేకలేక ఒక కొడుకు పుట్టాడు. పేరు రంగయ్య. ఆ పిల్లవాడి ముద్దు మురిపాలకు హద్దులు ఉండేవి కావు. 'కాలు క్రింద పెడితే కందిపోతాడు' అన్నట్లు చాలా సున్నితంగా చూసుకునేవాళ్ళు తల్లిదండ్రులు.

మెల్లగా బడికెళ్ళే వయసు వచ్చింది రంగయ్యకు. ప్రతిరోజూ కొడుక్కు చక్కగా ఉతికిన బట్టలు వేసి, ఖర్చులకు పది రూపాయలు ఇచ్చి, బడికి పంపించేవాడు రాముడు.

రంగయ్య పిల్లవాడుగా ఉన్నంత కాలం అమ్మానాన్నలు చెప్పినట్లు బాగా

చదువుకున్నాడు. కానీ, రాను రాను- రంగయ్య వయసు పెరిగింది; పెద్దవాడయ్యాడు; వక్రబుద్ధులు పెరిగాయి; తల్లిదండ్రులకు అబద్ధాలు చెప్పటం మొదలు పెట్టాడు; తెలివి కూడా పక్కదారి పట్టింది. బడికి వెళ్ళేటప్పుడు నాన్న ఇచ్చే డబ్బులు తీసుకుని, బడి ఎగ్గొట్టి, జులాయిగా తిరగటం మొదలు పెట్టాడు.



అమ్మానాన్నలు మాత్రం రంగయ్య బాగానే చదువుకుంటున్నాడని అనుకునే వాళ్ళు. వాళ్లకు రంగయ్య చేస్తున్న మోసం తెలియనే తెలియదు.

ఇట్లా రోజులు-నెలలు-సంవత్సరాలు గడిచినయ్. రంగయ్య పదో తరగతికి వచ్చాడు. తరగతికి అసలు సరిగా వచ్చేవాడే కాదు; పాఠాలు వినేవాడే కాదు; ఉపాధ్యాయులు చెప్పిన మాటలు వినేవాడు కాదు; చదువంటే అమిత అశ్రద్ధగా ఉండేవాడు.

వాళ్ల అమ్మానాన్నలకు వాడి గురించిన వాస్తవాలు ఎవ్వరూ చెప్పనే లేదు: ఏమంటే, 'పిల్లాడి సంగతి తల్లిదండ్రులకు వాడి గురించి తెలీకుండా ఎలా ఉంటుంది? చెబితే మనల్నే తప్పు పడతారు' అనుకున్నారు.

అంతలో పదవ తరగతి ఆఖరి పరీక్షలు రానే వచ్చాయి. రంగయ్యకు అక్షరాలు కూడా రావు! ఇంక ఏం రాస్తాడు? పదవ తరగతి ఫెయిల్ అయ్యాడు.

తల్లిదండ్రులు లబోదిబోమంటూ బడికి పరుగెత్తుకొచ్చారు- 'ఇదేంటి, మావాడు

ఇన్నేళ్ళు చదివితే ఇప్పుడు ఇలా ఎందుకైంది?' అని అందరినీ అడిగారు.

సంగతి తెలిసాక వాళ్ళ బాధకు అంతులేదు. ఆ బాధలో రంగయ్యను చితకబాదారు. 'ఇక లాభం లేదు' అని చదువు మాన్పించి రంగయ్యను కూలి పనికి పంపించారు.



రంగయ్యకు ఆ పని నచ్చలేదు- కానీ వేరే ఏ విద్యా రాదాయె! అట్లా కొన్నాళ్ళు గడిపాక, అమ్మానాన్నల సాయంతో ఓ ఆటో కొనుక్కొని నడిపించటం మొదలు పెట్టాడు.

గతాన్ని తలచుకొని రంగయ్య చాలా సిగ్గ పడ్డాడు. 'అయినా గడిచిన కాలం తిరిగి రాదు కదా, కనీసం ఇప్పటినుండైనా బాధ్యతగా మెసలుకుంటాను!' అని సక్రమంగా పని చేస్తూ పోయాడు.

ఆలోగా కుటుంబ బాధ్యతలు పెరిగాయి- పెద్దవాడౌతున్న కొద్దీ తండ్రి సంపాదన తగ్గింది. రంగయ్య ఆయనకు చేదోడు వాదోడుగా నిలిచాడు. సొంతంగా ఒక ప్యాసెంజరు జీపు కొనుక్కున్నాడు. 'మంచోడు' అనిపించుకున్నాడు.

ఇప్పుడు రంగయ్యకు ఇద్దరు పిల్లలు. వాళ్లను రోజూ ఇష్టంగా బడికి పంపుతున్నాడు. ఊరికే పంపటం కాదు- వాళ్ళు ఎట్లా చదువుతున్నారో పట్టించు-కుంటున్నాడు. అధ్యాపకులను కలిసి పిల్లల లోటు పాట్లు తెలుసుకుంటున్నాడు; వాటిని సరిదిద్దేందుకు శ్రమించి పని చేస్తున్నాడు. "పిల్లలు వృద్ధిలోకి రావాలి, జ్ఞానవంతులు కావాలి" అని తపిస్తున్నాడు.

మరి రంగయ్య కలల్ని పిల్లలు నెరవేరుస్తారో, లేదో- చూడాలి.



# దయ్యం కథ

రచన : వైష్ణవి, రిషీవ్యాలీ స్కూల్

అనగనగా ఒక ఊళ్లో ఒక అబ్బాయి ఉండేవాడు. ఆ అబ్బాయి పేరు వినాయకుడు. తను ఒక మంచి అబ్బాయి.

అందరూ కూడా 'తను చదువుకు సరైనోడు' అనేవాళ్ళు.

చక్కగా చదువుకునే వినాయకుడంటే అందరికీ ఇష్టమే. 'అ-ఆ' లు కూడా అందరికంటే ముందు నేర్చేసుకున్నాడు వినాయకుడు.

మరి ఇప్పుడు తన వయస్సు పది

సంవత్సరాలు. ఈ సరికి రకరకాల పుస్తకాలు ఎన్నో చదివేసాడు. సాహసాల కథలు, దయ్యాల కథలు, దొంగల్ని పట్టుకునే కథలు అంటే వాడికి చాలా ఇష్టం.



వినాయకుడు ఆటలు కూడా బాగా ఆడేవాడు. బలంగా కూడా తయారయ్యాడు. కానీ తనకు ఇష్టమైన ఆట చదరంగం. చదరంగంలో తను అందరినీ ఓడించేవాడు.

వాళ్లకి మార్చి నెలలోనే సెలవలు ఇచ్చేస్తారు. అట్లా వాళ్లకి ప్రతి ఎండాకాలంలోనూ రెండు నెలల సెలవులు దొరుకుతాయి. ఆ సమయాన్ని పిల్లలు తమకు నచ్చిన పనులు చేసేందుకు వాడుకుంటారు.

ఆ సెలవులలో ఒక రోజున, రోడ్డు మీద జనాలంతా గుంపుగా గుమిగూడి ఉండటం చూసాడు వినాయకుడు. వాళ్లలో కొందరు బాధ పడుతూ వెనక్కి వస్తున్నారు. మరి కొందరేమో నవ్వుతున్నారు.

"ఏమైందో ఏమో!" అని తను కూడా అక్కడికి వెళ్ళాడు. అంతలోనే అక్కడ తన మిత్రుడు శివ కనిపించాడు వినాయకుడికి.

"ఏమైందిరా?" అని అడిగాడు శివని.

"నువ్వే చూడు- పాపం బాగా భయపడిన-ట్లున్నాడు. దయ్యాన్ని చూసాడట!" చెప్పాడు శివ.

"దయ్యాన్ని చూసాడా?!" అని వినాయకుడు తను కూడా ఆ గుంపులోకి దూరి చూసాడు.

అక్కడ ఒక పెద్దమనిషి- వణుక్కుంటూ ఒక

కుర్చీ మీద కూర్చొని ఉన్నాడు. అందరూ ఆయన్ని ఓదారుస్తున్నారు. కొందరేమో వేప ఆకులు తెచ్చి అక్కడంతా గాలిలో తిప్పుతున్నారు.

వినాయకుడు ఒకాయనను "ఏమైంది?" అని అడిగాడు.

"ఇతను ఊరి చివరన ఉన్న ఆ పాడుపడ్డ కోట లోపలికి వెళ్లాడట. అక్కడ ఏవో విచిత్రమైన శబ్దాలు వినిపించాయట. వెనక్కి తిరగ్గానే ఒక దయ్యాన్ని చూసాడట- అట్లా చెబుతున్నారు అందరూ. ఆ కోటలోకి పోయిన వాళ్లంతా ఇవాల్టికీ అట్లా భయపడుతూనే వున్నారు- అసలు ఎందుకు పోతారో, ఏమో!" చెప్పి వెనక్కి తిరిగాడాయన.

వినాయకుడు కూడా ఆయన వెనకనే గుంపులోంచి బయటికి వచ్చాడు. అక్కడ శివ వాడికోసమే ఎదురు చూస్తూ ఉన్నాడు.

"చూసావా?" అడిగాడు శివ.

"ఊఁ.. ఇందులో ఏదో మెలిక ఉంది" అన్నాడు వినాయకుడు.

"ఏమై ఉంటుంది?" అడిగాడు శివ.

"మనం వెళ్ళి కోటలో ఆడుకుంటే తప్ప, నిజం ఏంటో తెలీదు- మరి ఆడటానికి వస్తావా?" శివ 'సరే' అన్నాడు.

ఇద్దరూ బ్యాటు, బంతి పట్టుకొని కోట దగ్గరికి చేరుకున్నారు.

ఊరు చివరికి చేరుకుంటుండగా శివ అడిగాడు- "మనం నిజంగానే కోటలోకి వెళ్తున్నామా?!" అని.

"అనుమానం లేదు. ఖచ్చితంగా వెళ్తున్నాం" అన్నాడు వినాయకుడు.

శివ ఒకసారి వణికాడు- "ఏమో, నువ్వు అంత గట్టిగా చెబుతున్నావుగానీ, నాకైతే భయంగా ఉంది" అన్నాడు.

"భయం ఏమీ లేదు. దయ్యాలు మనల్ని ఏమీ చెయ్యవు. నువ్వు శివుడివి, నేను వినాయకుడిని!" నమ్మకంగా చెప్పాడు వినాయకుడు.

వాళ్లు కోటలోకి పోయి ఆడటం మొదలు పెట్టారు.

చాలా సేపే గడిచింది గానీ దయ్యం ఏదీ వాళ్ల ముందుకు రాలేదు.

అయితే వాళ్ల ఆట ఇంకొంచెం సేపట్లో అయిపోతుందనగా వాళ్లకు విచిత్రమైన శబ్దాలు వినిపించటం మొదలెట్టాయి.

శివ గబగబా వినాయకుడి ప్రక్కకు వచ్చి నిలబడ్డాడు. వినాయకుడేమో జేబులు తడుముకుంటూ నిల్చున్నాడు.

కొద్ది సేపట్లోనే వాళ్ల ముందరికి వచ్చి నిల్చున్నది ఒక దయ్యం!!

వినాయకుడు జేబులోంచి చేతులు తీసాడు. శివకి ఏదో అందించాడు.

ఇద్దరూ ఒక్కసారిగా తమ చేతుల్లో ఉన్న కారపు పొడిని దయ్యం మీదికి చల్లి, ఊదటం మొదలెట్టారు.

అంతలో వినాయకుడు జేబులోంచి ఒక నిమ్మకాయ తీసి దయ్యం మీద పిండటం మొదలెట్టాడు.

ఆశ్చర్యం, దయ్యం ఏమీ చెయ్యలేదు. ఊరికే అట్లా నిలబడ్డది.

అంతలోనే వాళ్లకు దయ్యం క్రింద మనిషి కాళ్లు కనబడ్డాయి.



ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకొని, గబుక్కున దయ్యం మీదికి దూకారు. అది వేసుకున్న ముసుగును లాక్కున్నారు.

ఇప్పుడక్కడ, దయ్యం స్థానంలో ఎవరో ఒక పిల్లాడు- బిక్క మొఖం వేసుకొని నిలబడి ఉన్నాడు!

వినాయకుడు తన చేతిలోని బ్యాటుని ఎత్తి, వాడిని బెదిరిస్తున్నట్లు పెట్టి, అడిగాడు- "ఎందుకురా, నువ్వు ఎందుకు ఈ దయ్యం వేషం వేసి, జనాల్ని భయపెడ్తున్నావు?" అని.

ఆ పిల్లాడు ఒక క్షణం ఊపిరి పీల్చుకొని, ఇలా చెప్పాడు:

"మాది చాలా పేద కుటుంబం. మా అమ్మానాన్నలు బడి ఫీజులకు కూడా డబ్బులు ఇవ్వరు. అడిగితే పనికి పొమ్మంటారు- కానీ నాకేమో చదువు అంటే చాలా ఇష్టం. అందుకని ఇట్లా వేషం వేసుకోవటం మొదలుపెట్టాను. ఇక్కడికి వచ్చిన వాళ్ళు నన్ను చూసి పారిపోతూ వదిలేసిన వస్తువులను అమ్ముకుంటాను- అట్లా బడి ఫీజులు కడుతున్నాను.."

వినాయకుడికి చాలా బాధ వేసింది. "అయినా ఇట్లా ఇంకోళ్లని భయపెట్టటం మంచిపని కాదు కదా- ఒక పని చేస్తావా? మాతోబాటు రా. మా అమ్మా వాళ్లని పరిచయం చేస్తాను. వాళ్లు నీకు ఏమైనా సాయం చేస్తారేమో చూద్దాం. అయితే నువ్వు ఇంకెప్పుడూ ఇట్లా దయ్యం వేషం వేసి జనాల్ని భయపెట్టకూడదు!" అన్నాడు.

ఆ పిల్లాడి ముఖం వికసించింది. "సరే- నువ్వు చెప్పినట్టే చేస్తాను. ఇంకెప్పుడూ దయ్యం వేషం వేయను" అని వాళ్లతోబాటు బయలు దేరాడు.

వినాయకుడు ఆ పిల్లాడిని తమ ఇంటికి తీసుకెళ్ళాడు. వినాయకుడు వాళ్ల అమ్మానాన్నలు ఆ పిల్లాడి చదువుకోసం ఎప్పటికప్పుడు సహాయం చేసారు! అటు తర్వాత కోటలో ఇంకెప్పుడూ దయ్యం అన్నదే కనిపించలేదు.



బస్ కండక్టర్: బాబూ నీకెన్నేళ్లు?

బాబు: మూడేళ్లు.

కండక్టర్: మరి నాలుగేళ్లు ఎప్పుడొస్తాయి.

బాబు: బస్సు దిగ్గానే.

భార్య: ఏం చేస్తున్నారక్కడ!

భర్త: మొక్కలకి నీళ్లు పోస్తున్నాను.

భార్య: వర్షం పడుతోందిగా

భర్త: ఫర్వాలేదు, గొడుగు వేసుకొని పోస్తున్నా.





# తప్పిపోయిన స్వాతి

*రచన: తన్మయి కృష్ణ చౌదరి, 7 వ తరగతి, విశ్వ భారతి వైస్‌వుడ్స్ స్కూల్, వానపాముల గ్రామం, కృష్ణా జిల్లా*

అనగనగా ఒక ఊళ్లో స్వాతి అనే అమ్మాయి ఉండేది. తనకు మాటలు రావు. మూగది. ప్రతి విషయం సైగలు చేసి చెప్పేది. కానీ ఆ పాప మొద్దు కాదు- చాలా తెలివైనది. ఏడవ తరగతి చదువుతన్నది; చదువులో ఎప్పుడూ మొదటి స్థానంలో ఉండేది.

స్వాతికి నీరజ అనే ఒక స్నేహితురాలు ఉండేది. తను స్వాతిని అన్ని విషయాలలోనూ ప్రోత్సహించేది.

స్వాతి వాళ్ళ అమ్మానాన్నలు తనని చాలా ప్రేమించేవాళ్ళు. తను అడగకనే తనకేది ఇష్టమో గ్రహిస్తారు వాళ్ళు.

వాళ్ళ నాన్న తనకు చాలా సార్లు చెప్పేవాడు: "నువ్వు ఎప్పటికీ మాట్లాడలేక పోవచ్చు. అయినా ఏమీ నష్టం లేదు. నువ్వు బాగా చదివి, మంచి ప్రయోజకురాలివి అవ్వాలి" అని. స్వాతి వాళ్ల అమ్మ చెప్పేది: "నువ్వు ఎప్పుడూ నవ్వుతూనే ఉండాలి" అని. అమ్మానాన్నలంటే స్వాతికి చాలా ఇష్టం.



ఒకసారి స్వాతి, వాళ్ల అమ్మ ఇద్దరూ ఒక పుణ్యక్షేత్రానికి వెళ్లారు. శ్రద్ధాభక్తులతో ఎవరైనా తమ మనసులోని కోరికలను అక్కడి దేవుడికి చెప్పుకున్నట్లైతే, అవి తప్పక నెరవేరుతాయని ప్రజల విశ్వాసం. "స్వాతికి మాటలు రావాలి దేవుడా!" అని కోరుకున్నది వాళ్ల అమ్మ. ఆ క్షేత్రం గురించిన వివరాలన్నీ సేకరించి నోట్సులో రాసుకున్నది స్వాతి.

దర్శనం అయ్యాక ఇద్దరూ రైలు బండెక్కి ఇంటికి బయలుదేరారు. అయితే రైలులో స్వాతికి నిద్ర పట్టలేదు. ప్రక్కనే వాళ్ల అమ్మ మటుకు నిద్రపోయింది. కిటికీ ప్రక్కనే కూర్చొని, బయటి చీకట్లోకి చూస్తూ కూర్చున్నది స్వాతి. అంతలో రైలు బండి ఏదో చిన్న స్టేషనులో ఆగింది.

ప్లాట్‌ఫారంకి ఆవల చెట్లు గుబురుగా పెరిగి ఉన్నాయి. చిన్న కుక్క పిల్ల ఒకటి, అక్కడ "కుయ్..కుయ్" మని మొత్తుకుంటున్నది. స్వాతి కిటికీ తెరిచి, దాన్ని పిలిచింది. అది గట్టిగా పెనుగులాడింది: మరింత గట్టిగా మొత్తుకున్నది. స్వాతికి దాని పరిస్థితి చూసి జాలి వేసింది. లేచి, తలుపు దగ్గరికి వెళ్ళి, చూసింది: కుక్క పొదలో ఇరుక్కు పోయి ఉన్నది!

స్వాతి అటూ ఇటూ చూసింది- ఎవరైనా పెద్దవాళ్లు కనిపిస్తారేమోనని. అయితే ఆ

సమయంలో అందరూ గాఢ నిద్రలో ఉన్నారు. రైలేమో ఏమీ చప్పుడు చేయట్లేదు. ఇప్పట్లో కదిలేటట్లు అనిపించలేదు. దాంతో స్వాతి మెల్లగా రైలు బండి దిగి, ముళ్ళపొద దగ్గరికి పోయింది. జాగ్రత్తగా అందులో ఇరుక్కున్న కుక్క పిల్లను తప్పించింది. దాన్ని బయటికి తీసి వదిలిపెట్టింది.



కుక్కపిల్ల తోక ఊపుకుంటూ పరుగు

పెట్టాకగానీ గమనించలేదు స్వాతి- తను ఎక్కాల్సిన రైలు తన వెనకనుంచే నిశ్శబ్దంగా బయలుదేరి పోయింది! ఆ సరికే స్టేషను దాటి పోతున్నది! పోతున్న ఆ రైలు వెనకే ప్లాట్‌ఫారం చివరి వరకూ పరుగుపెట్టి, ఏడుస్తూ అక్కడే కూలబడింది స్వాతి!

ఇక అక్కడ, రైలులో స్వాతి వాళ్ల అమ్మగారికి తెల్లవారే వరకూ మెలకువ రాలేదు. నిద్రలేచి చూసుకుంటే పక్కన ఉండాల్సిన స్వాతి కనిపించలేదు! దాంతో వాళ్ల అమ్మగారు కంగారు పడ్డారు. రైలులో అంతటా వెతికారు. బిడ్డ ఎక్కడా కనిపించలేదు!

ఆలోగా రైలు వాళ్ళ ఊరుకు చేరుకున్నది. ఆవిడ రైలు దిగి, స్టేషను మాస్టారుగారికి ఫిర్యాదు చేసారు. ఇంట్లో ఉన్న భర్తకు ఫోను చేసి జరిగినదంతా చెప్పారు. వెంటనే ఆయనకూడా రైలు స్టేషనుకు వచ్చేసారు. రైలు ఏ ఏ స్టేషన్లలో ఆగుతుందో ఆయా స్టేషను మాస్టర్లందరికీ వరసగా ఫోన్లు చేయించారు.

ఇక అక్కడ, ప్లాటుఫారం చివరలో కూర్చొని ఏడుస్తున్న స్వాతిని చూసి "ఏమైంది?" అని అడిగాడొక పిల్లాడు. వాడి పేరు అరవింద్. వాడు ఐదో తరగతి చదువుతుండగా వాళ్ల అమ్మానాన్నలు ఇద్దరూ ప్రమాదంలో చనిపోయారు. అప్పటినుండి వాడు ఆ ఊర్లోనే ఉంటూ, జనాలకు ఆ పనీ, ఈ పనీ చేసి పెడుతూ ఉన్నాడు.

కానీ వాడు ఏమడిగినా స్వాతి ఏడుస్తున్నది తప్పిస్తే ఏమీ సమాధానం ఇవ్వలేదు. చివరికి వాడు- "ఇదిగో చూడు పాపా, నువ్వు తప్పిపోయావని నాకు అర్థమైంది; నిన్ను మీ ఇంటికి చేరుస్తాను ఎలాగైనా; అయితే మీ ఊరేదో, ఇల్లెక్కడో తెలియాలి కదా ముందు?!" అన్నాడు గట్టిగా.

దాంతో స్వాతి ఏడుపు ఆపి, సైగలు చేయటం మొదలు పెట్టింది. కొద్ది సేపటికిగానీ అరవింద్‌కు అర్థం కాలేదు- 'ఈ పాపకి మాట్లాడటం రాదు' అని. అప్పుడిక వాడు ఆ పాపకి ధైర్యం చెప్పి, స్టేషను మాస్టరు గారి దగ్గరికి తీసుకెళ్ళాడు. స్టేషను మాస్టరుగారికీ సైగల భాష రాదాయె!

అంతలో అరవింద్‌కి ఒక ఐడియా వచ్చింది: ఒక పెన్ను, కాగితం తెచ్చి స్వాతికి ఇచ్చి, 'మీ అడ్రసు, ఫోను నెంబరు రాయమ'న్నాడు. అప్పటివరకూ స్వాతి ఊరికే కంగారు పడుతూ ఉండింది కానీ, "ఇట్లా రాసి చూపచ్చు కదా" అని గుర్తుకే రాలేదు!



ఇక ఆ తర్వాత ఆలస్యం ఏమీ లేదు- స్టేషను మాస్టారుగారు వెంటనే స్వాతి వాళ్ళ ఊరి స్టేషను మాస్టారికి ఫోను కలిపారు. స్వాతి వాళ్ల అమ్మానాన్నలు ఆయన ముందే కూర్చొని ఉన్నారు కంగారు పడుతూ.

సంగతి తెలియగానే వాళ్లకి ప్రాణం లేచి వచ్చినట్లయింది.

వెంటనే ఇద్దరు రైల్వే పోలీసులను వెంట బెట్టుకొని, వాళ్ళు స్వాతి దగ్గరికి చేరుకున్నారు. అంతవరకూ రైల్వేస్టేషనులో కూర్చొని అరవింద్‌తో సంతోషంగా ఆడుకుంటూ ఉన్నది స్వాతి-

అమ్మానాన్నల్ని చూసిన ఆనందంతో ఆ పాప కొద్దిసేపు మూర్ఛపోయింది! అది చూసి అమ్మానాన్నలు చాలా కంగారు పడ్డారు! కానీ, కొద్ది సేపటికి తేరుకున్న స్వాతి 'అమ్మా! నాన్నా! వీడు అరవింద్!' అని మాట్లాడటం మొదలెట్టేసరికి, ఆనందంతో పొంగి పోయారు వాళ్ళు. ఏనాటికీ మాట్లాడద-నుకున్న పాప ఎలా మాట్లాడిందో తెలీక ఆశ్చర్యంలో మునకలు వేసారు.

స్టేషను మాస్టరుగారు వాళ్ళకు అరవింద్‌ని పరిచయం చేసారు: "వీడు బలే తెలివైనవాడు సర్- వీడి వల్లనే మీ పాపని మీకు ఇంత త్వరగా అందించగలిగాం" అని, వాడి గురించి చెప్పారు.

స్వాతి వాళ్ల అమ్మానాన్నలకు కూడా అరవింద్ చాలా నచ్చాడు. వాళ్ళు కొద్ది సేపు స్వాతితో మాట్లాడి, స్టేషను మాస్టారు గారితో "ఇక్కడెవ్వరికీ అభ్యంతరం లేదంటే, మేం అరవింద్‌ని మాతో పాటు తీసుకెళ్తామండి- మా పిల్లవాడుగా పెంచుకుంటాం. చదువు చెప్పించి ప్రయోజకుడిని చేస్తాం!" అన్నారు.

ఊరి వాళ్లంతా కలిసి మాట్లాడుకొని, ఆ రోజు సాయంత్రమే అరవింద్‌ని స్వాతి వాళ్ల వెంట పంపారు. అట్లా అరవింద్‌కి మళ్ళీ ప్రేమాభిమానాలు, ఆప్యాయతలతో నిండిన కొత్త జీవితం దొరికింది; స్వాతికి మంచి అన్న దొరికాడు.

తర్వాతి కాలంలో అరవింద్ బాగా చదువుకొని గొప్ప డాక్టరై తన ఊరికీ, పెంచిన తల్లిదండ్రులకూ కూడా మంచి పేరు తెచ్చాడు!

స్వాతి కూడా డాక్టరైంది- 'అన్నకు తగిన చెల్లెలు' అనేవాళ్లు, వాళ్లని చూసినవాళ్లంతా!





# మోసం దాగదు

రచన:శ్రీ చాతుర్య, రిషీ వ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.

రాజు చాలా బాగా చదివేవాడు. అన్నిటిలోనూ ముందుండేవాడు. చదువు పూర్తి అయ్యాక కొద్ది నెలల్లోనే తనకు ఉద్యోగం కూడా వచ్చింది.

ఉద్యోగ రీత్యా అతను మరో ఊరికి వెళ్లాల్సి ఉంటుంది. వాళ్ల నాన్న సాయంతో రాజు ఆ క్రొత్త ఊళ్లో ఓ ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.

కొత్తగా ఉద్యోగం; వంట అదీ ఇంకా పూర్తిగా రాదు; ఒంటరిగా ఉండటం కూడా బాగా అలవాటు లేదు.

అయినా ఉద్యోగం అంటే తప్పదు కదా, రాజు తను బాడుగ ఉండే ఇంటి చుట్టు ప్రక్కల వాళ్లని పరిచయం చేసుకున్నాడు. మంచి పిల్లవాడు కావటంతో అందరూ అతనికి బాగానే సహకరించారు. రోజూ

ఉదయాన్నే పనికి పోయి, రాత్రి బాగా ప్రొద్దు పోయాక ఇంటికొచ్చేవాడు రాజు.



రాజు బాడుగ ఉండే ఇంటికి ఎదురుగా నివసించేవాడు, సోను. ఇంట్లో చేరిన కొద్ది కాలంలోనే రాజుకి సోను బాగా దగ్గరయ్యాడు. చలాకీగా తిరుగుతూ, స్నేహపూర్వకంగా ఉంటూ, పనులన్నీ చక్కబరిచే సోనుని రాజు చాలా ఇష్టపడేవాడు; బాగా నమ్మేవాడు.

రోజూ తన ఇంటి తాళం చెవిని సోనూకి ఇచ్చి ఉద్యోగానికి వెళ్లేవాడు రాజు. మధ్యాహ్న సమయంలో అంతా రాజు ఇంట్లోనే గడిపేవాడు సోను.

అట్లా మెల్లగా రోజులు గడిచాయి. రాజు ఉద్యోగంలో చేరి నెలరోజులు పూర్తి అయ్యాయి; మొదటి జీతం చేతికి వచ్చింది. ఆ సందర్భంగా చుట్టు ప్రక్కల వాళ్లకి అందరికీ స్వీట్లు పంచాడు రాజు.

ఇంటి అద్దె మొదలైనవి చెల్లించాక, మిగిలిన జీతపు డబ్బుల్ని ఒక సూటుకేసులో దాచుకున్నాడు. "ఈ డబ్బుల్ని ఊరికి పంపిస్తాను, మా అమ్మావాళ్ళు చాలా సంతోషపడతారు" అని కూడా చెప్పాడు సోనుతో.

ఆ తర్వాతి రోజున ఎప్పటి మాదిరే ఇంటి తాళం వదిలేందుకు సోను దగ్గరికి వెళ్తే, "నేను ఉండట్లేదు- అర్జంటుగా పొరుగూరికి వెళ్తున్నాను- మధ్యాహ్నంకల్లా వచ్చేస్తాను" అన్నాడు సోను.

"నేను వచ్చేసరికి ఎలాగూ సాయంత్రం అవుతుందిగా, ఇది నీ దగ్గరే ఉండనియ్యి"

అని తాళంచెవి సోను గదిలోనే గోడకి తగిలించి ఆఫీసుకు వెళ్ళాడు రాజు.

ఆ రోజు సాయంత్రం ఆఫీసునుండి తిరిగి వచ్చే సరికి రాజు ఇంటికి వేసిన తాళం విరిగి పడి ఉన్నది! తలుపు ఊరికే గడియ పెట్టి ఉంది. లోపలికి వెళ్లి చూస్తే తన సూటుకేసు బ్రద్దలై ఉంది. దాంట్లో డబ్బులు మాయం! ఆ సమయానికి సోను తన ఇంట్లోనే ఉన్నాడు- సంగతి చెబితే "అయ్యో,అలాగా! రోజూ నేను ఉంటున్నాను కదా, గమనించుకుంటున్నాను. ఇవాళ్ళే నేనూ లేను; అందుకని ఇట్లా జరిగింది!" అన్నాడు బాధగా మొహం పెట్టి.

తన ఇంట్లో దొంగతనం జరగటం, మొదటి జీతం కాస్తా దొంగపాలవ్వటం రాజుకు చాలా బాధ కలిగించింది. "పోలీసు కంప్లెయింటు ఇద్దాం- నువ్వూ రా, కొంచెం!" అన్నాడతను. కానీ ఎందుకనో, సోను ఉత్సాహం చూపలేదు- "అప్పుడప్పుడు మన ఊళ్లో దొంగతనాలు జరుగుతూనే ఉన్నాయి రాజూ, చాలా మంది పోలీసు కంప్లెయింటు ఇచ్చారు కూడా. కానీ అసలు దొంగలు ఎవరో ఎవ్వరూ కనిపెట్టలేకపోయారు. ఇప్పుడూ ఏమీ ప్రయోజనం ఉండదు" అనేసాడు.

పోలీసు కంప్లెయింటు ఇవ్వకుండానే మరో నెల గడిచింది. రెండో నెల జీతం వచ్చింది. రాజు ఆ సంగతి సోనూకు చెప్పి, "రేపు నువ్వు ఉంటున్నావుగా? నా జీతం మొత్తం ఇంట్లోనే ఉంటుంది!" అన్నాడు.

"అయ్యో! లేదే! నేను రేపు ఉదయాన్నే ఊరికి వెళ్తున్నాను!" అన్నాడు సోను.

"మరెట్లాగ? ఈ డబ్బుని ఏం చెయ్యాలో ఏమో!" అన్నాడు రాజు ఆందోళనగా.

"చూద్దాం.. రేపు మధ్యహ్నం వరకు ఆగగలను నేను" అన్నాడు సోము.

"మరుసటి రోజున దొంగ తప్పనిసరిగా వస్తాడు" అని గట్టిగా అనిపించింది రాజుకు. దొంగని పట్టుకోవటం గురించి కూడా ఒక ఆలోచన వచ్చింది. ఇంటి వెనక ప్రక్క

తలుపులు తీసిపెట్టాడు. ముందువైపు నుండి రోజూ మాదిరే తాళం వేసాడు. తాళం చెవుల్ని సోనుకు ఇచ్చేసాడు.



అట్లా కొంచెం దూరం వెళ్ళినట్లే వెళ్ళి, చటుక్కున వెనక్కి తిరిగి వచ్చేసాడు. వెనక తలుపు నుండి ఇంట్లోకి వచ్చి దాక్కున్నాడు.

కొంచెం సేపటికి బయటి తలుపు శబ్దం అయ్యింది. ఎవరో తాళం పగుల గొడుతున్నారు! లోపలి గదిలో సూట్‌కేసుకు దగ్గర్లోనే ఓ దుడ్డు కర్రను పట్టుకొని తయారుగా నిల్చున్నాడు రాజు. కొద్ది సేపటికి తాళం పగిలింది- మెల్లగా తలుపు తెరచుకొని ఇంటిలో అడుగు పెట్టాడు- సోను!!

అతన్ని చూసి రాజు నిర్ఘాంతపోయాడు. ఆ నమ్మక ద్రోహాన్ని తలచుకున్నకొద్దీ అతని రక్తం మరిగింది. దొంగవాడు సూటుకేసుని పగలగొట్టేందుకు కూర్చోగానే దుడ్డుకర్రతో అతని నెత్తిమీద ఒక్కటిచ్చిన రాజు, ఆ వెంటనే అతన్ని వెనక వైపు నుండి గట్టిగా పట్టేసుకొని "దొంగ! దొంగ!!" అని అరిచాడు. ఆ అరుపులకు చుట్టుప్రక్కల వాళ్లంతా వచ్చారు. అందరూ కలిసి సోనూను పోలీసులకు అప్పగించారు.

ఎవరికీ చిక్కకుండా దొంగతనాలు చేస్తూ పోతున్న సోనును తెలివిగా పట్టించిన రాజును పోలీసులు అభినందించారు.

# కష్టాలలో తెగువ

రచన: సాముల శ్రీకాంత్ రెడ్డి, 9 వ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ



హుజూర్‌నగర్లో ఆరవ తరగతి చదువు-తున్నారు శ్రీకాంత్, నరేందర్. వాళ్ళిద్దరూ చాలా మంచి స్నేహితులు. ఒకరి కష్టాలు-సుఖాలు మరొకరు పంచుకునేవారు. ప్రతి పనినీ నిజాయితీగా చేసేవాళ్లు.



వాళ్ళిద్దరూ మంచిగా ఉండటం చూసి తరగతిలోని మిగతా పిల్లలకు ఈర్ష్యగా ఉండేది. దాంతో వాళ్ల మీద ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పి, ఉపాధ్యాయులకు వాళ్లంటే చెడు అభిప్రాయాన్ని కల్పించారు. అప్పటినుండీ ప్రతి ఉపాధ్యాయుడూ వాళ్ళనే నిందించడం మొదలుపెట్టారు. అన్నింటా అనుమానించ సాగారు.

అట్లా ఎన్ని నిందలు పడ్డా 'మన మంచికే' అనుకున్నారు వాళ్ళు. ఏమాత్రం

బాధపడలేదు. తోటివారి మీద ఏమాత్రం కోపం పెంచుకోలేదు.



అంతలో SA-1 పరీక్షలు వచ్చాయి. శ్రీకాంత్, నరేందర్ ఇద్దరూ గదిలో చెరొక మూలనా కూర్చున్నారు. ఎవ్వరినీ ఏమీ అడగకుండా నిజాయితీగా పరీక్ష రాశారు.

వాళ్ళు రాసిన పేపర్లను వేరే బడి టీచర్లు దిద్దారు. తర్వాతి వారంలో మార్కులు వెల్లడించినప్పుడు చూస్తే, క్లాసు మొత్తం మీద శ్రీకాంత్‌కు, నరేందర్‌కు వచ్చినన్ని మార్కులు వేరే ఎవ్వరికీ రాలేదు!




అప్పుడు ఉపాధ్యాయులకు నిజం తెలిసింది. అటుపైన వాళ్ళతో మంచిగా ప్రవర్తించటం మొదలు పెట్టారు.

కోపాన్ని, ఆవేశాన్ని పనులు సాధించటం ద్వారా వ్యక్తం చేయాలి తప్ప, ఇతరులతో ఊరికే గొడవ పడి కాదు!



# అత్యాశ

*సేకరణ:యస్.రాజేశ్వరి, 8 వతరగతి, జిల్లా పరిషత్ హైస్కూల్, పెద్దపసుపుల గ్రామం.*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

అనగనగా ఒక ఊళ్లో సోమయ్య అనే రైతు ఉండేవాడు. అతని భార్య కాంతమ్మ. వాళ్లకొక చిట్టి కూతురు -పేరు సుమతి. ఒక సంవత్సరం సోమయ్యకు వ్యవసాయంలో చాలా నష్టం వచ్చింది. పూట గడిచేందుకు కూడా డబ్బు లేదు. పులి మీద పుట్రలాగా అదే సమయంలో కాంతమ్మ ఆరోగ్యం పాడైంది. ఆరు నెలలపాటు మంచంలో ఉండి ఆమె కన్ను మూసింది.

సోమయ్య హతాశుడైనాడు. అయితే తరువాతి సంవత్సరం బాగా వానలు పడ్డాయి; అంతా కలిసి వచ్చింది. సోమయ్య మళ్ళీ మోతుబరి అయ్యాడు. సుమతి కోసం మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మని చుట్టాలు పక్కాలు

అందరూ పోరారు. వాళ్ల పోరు పడలేక, ఒక్కడే సుమతిని సాకలేక, సూరమ్మని రెండో పెళ్ళి చేసుకున్నాడు సోమయ్య.

సూరమ్మ ఘటికురాలు. వచ్చీ రాగానే సుమతి ఎలాంటిదో అంచనా వేసింది. సోమయ్య తత్వాన్ని అర్థం చేసుకున్నది. క్రమంగా ఇంటి ఆజమాయిషీని యావత్తూ తన చేతి క్రిందికి తెచ్చుకొని, సోమయ్యను తన గుప్పెట్లో పెట్టుకున్నది.

అప్పటివరకూ తల్లి లేకున్నా సుఖంగా బ్రతికిన సుమతికి పెద్ద పెద్ద కష్టాలు మొదలయ్యాయి. సుమతిని ఎన్నో బాధలు పెట్టేది సూరమ్మ. సుమతి చేతే వంట చేయించేది; గిన్నెలు తోమించేది; ఇల్లు అలికించేది; పశువుల పాకని శుభ్రం చేయించేది- ఒక్క క్షణం కూడా తీరికగా ఉండనిచ్చేది కాదు.

ఒకరోజు సూరమ్మ గుడికి వెళ్తూ, వంట పనిని సుమతికి పురమాయించింది- "ఇదిగో, నేను బయటికి వెళ్తున్నాను. వచ్చేసరికల్లా వంట తయారు చేసి ఉంచు. ముందే చెబుతున్నాను- భోజనాన్ని వేరే ఎవరికీ దానం చెయ్యకు. ఏ ముష్టివాడికో వేసావంటే చెబుతాను- నా సంగతి నీకు తెలుసు కదా?! జాగ్రత్త!" అని బెదిరించి చక్కా పోయింది.

సరిగ్గా సుమతి వంట పూర్తయ్యే సమయానికి ఒక స్వామీజీ వచ్చాడు- "తల్లీ భిక్షాం దేహి!" అంటూ. "వద్దు- వద్దు" అనుకుంటూనే సుమతి వెళ్ళి తలుపు తీసింది. తలుపు తీసింది కాబట్టి ఇక ఆయన్ని లోనికి రమ్మన్నది. రమ్మన్నది కాబట్టి, 'ఇక భోజనం పెట్టకపోతే ఏం బావుంటుంది?' అని భోజనం పెట్టింది. స్వామీజీ చక్కగా భోజనం చేసి, సుమతిని దీవించి వెళ్ళిపోయాడు.

ఆయన అటు వెళ్ళాడో లేదో, ఇటు సూరమ్మ ఊడి పడింది. సుమతి ఇంకా తేరుకోకనే భోజనం వడ్డించమని చెప్పి కూర్చున్నది. చూస్తే గిన్నెలో అన్నం సగమే ఉంది! "నేను నీతో చెప్పానుగా, ఎవరికీ

అన్నం పెట్టద్దని? ఇదేమైనా మీ తాతల సొమ్ము అనుకున్నావా?! నిన్ను భరించడం నా వల్ల కాదు. ఇంట్లోనుండి వెళ్ళిపో! అంతే!" అని కొట్టి, గెంటేసింది సుమతిని.

ఏడుస్తూ కనబడ్డ దారినల్లా పట్టుకొని పోయింది సుమతి. అట్లా పోతూ ఉంటే సాయంత్రం అయ్యేసరికి ఆ పాపకో పెద్ద మర్రిచెట్టు ఎదురయింది. చెట్టు చుట్టూతా మర్రి పళ్ళు పడి ఉన్నాయి. ఆ పాప కొద్ది సేపు వాటిని ఏరుకొని తిన్నది. కొన్నిటిని మూట కట్టుకున్నది.

అంతలోనే ఉరుములు, మెరుపులతో వర్షం కూడా మొదలైంది. దాంతో ఆ పాప గబగబా చెట్టు క్రిందికి చేరి వణుక్కుంటూ నిలబడ్డది. మెల్లగా చీకటి పడసాగింది; వర్షం ఆగేట్లు లేదు. చెట్టుకు అటువైపుగా ఓ తొర్ర ఉంది. సుమతి జాగ్రత్తగా ఆ తొర్రలోకి దూరి, ముడుచుకొని కూర్చున్నది. మెల్లగా నిద్రలోకి జారుకున్నది.

అర్థరాత్రి అవుతుండగా ఇద్దరు రాక్షసులు ఆ చెట్టు మీదికి వచ్చి వాలారు. వాళ్ళ బరువుకు చెట్టంతా అదిరినట్లైంది. సుమతి చటుక్కున లేచి కూర్చున్నది.

వాళ్లలో ఒకడు అన్నాడు "ఆకలిగా ఉందిరా. తినేందుకు ఏమైనా దొరికితే బాగుండు" అని.

"ఈ మధ్య మనకి సరైన ఆహారమే దొరకట్లేదు. ఇప్పుడు ఎవరైనా ఇటు వస్తే బాగుండు. కడుపునిండా తినచ్చు" అన్నాడు రెండోవాడు.

సుమతి చటుక్కున తొర్రలోంచి బయటికి వచ్చి, తన చేతిలోని మర్రి కాయల మూట వాళ్ళకేసి చాచింది- "ఇదిగో, ఇవి తినండి, బానే ఉన్నాయి. నేను తిన్నాను సాయంత్రం" అన్నది అమాయకంగా.

ఒక రాక్షసుడు చటుక్కున ఆ పాప మీదికి దూకబోయాడు. అయితే రెండోవాడు వాడిని వారించాడు. సుమతి మంచితనం, అమాయకత్వం రెండూ వాడిని కదిలించాయి. "ఏవీ, ఇటివ్వు పాపా!" అని,

వాడు రెండు మర్రి పళ్ళు నోట్లో వేసుకున్నాడు. "అద్భుతం! భలే ఉన్నాయి!" అన్నాడు నవ్వుతూ.

"నేను చెప్పలేదా, ఇవిగో, నువ్వు కూడా తిను. ఊరికే ఆకలితో ఉండకూడదు" అంటూ మూటని రెండోవాడికి అందించింది సుమతి. "కావాలంటే నేను ఇంకొన్ని మర్రిపండ్లు ఏరి పెడతాను" అని కూడా చెప్పింది.

సుమతి మంచితనానికి రాక్షసులిద్దరూ మైమరచిపోయారు. వాళ్ళిద్దరూ సంధ్యాసమయం వరకూ ఆ పాపతో ముచ్చట్లు పెట్టుకొని, వాళ్ల ఇంటి సంగతులన్నీ అడిగి తెలుసుకున్నారు. తెలవారుతుండగా ఇక ఆ పాపను ఇంటికి వెళ్లమని, అక్కడున్న ఇసుకను ఓ నాలుగు గ్లాసులంత మూట కట్టి ఇస్తూ "ఇదిగో పాపా! ఇది తీసుకెళ్ళి మీ చిన్నమ్మకి ఇవ్వు. బంగారమని చెప్పు. నిన్ను బాగా చూసుకోవాలని కూడా మా మాటగా చెప్పు. సరేనా?!" అని ముద్దుచేసి, పంపారు.

ఇంటికి వెళ్లగానే సూరమ్మ "ఎక్కడ చచ్చావే, రాత్రంతా?! నువ్వు లేకపోతే గిన్నెలు ఎవరు కడుగుతారు?" అని తిట్లు లంకించుకున్నది.

"మర్రి చెట్టు దగ్గరికి. ఇదిగో ఈ ఇసుక మూటని నీకు ఇమ్మన్నారు. బంగారమట. నన్ను బాగా చూసుకోవాలని వాళ్ల మాటగా చెప్పమన్నారు" అంటూ తన చేతిలోని మూటని సూరమ్మకి అందించింది సుమతి.

"ఎవరు వాళ్ళు?!" అంటూ మూట విప్పిన సూరమ్మ ఆశ్చర్యంతో నోరు తెరిచింది. మూట నిండుగా బంగారు ఇసుక! ధగధగా మెరుస్తున్నది.

"ఎక్కడిదే, ఇది?" అని అడిగి సంగతంతా తెలుసుకున్నది సూరమ్మ. "అక్కడి ఇసుకంతా బంగారమేనట!" అనుకున్నది తప్పిస్తే, రాక్షసుల గురించి సుమతి చెప్పిందేదీ ఆమె తలకు ఎక్కలేదు. "పిచ్చిది, ఎవరినో చూసి 'రాక్షసులు' అనుకున్నది. రాక్షసులెందుకుంటారు, ఈ రోజుల్లో?!" అనుకున్నది.

సుమతికి రాత్రి మిగిలిన అన్నమూ, కూరలూ పెట్టి, "అక్కడికి వెళ్ళేందుకు దారేదే?" అని అడిగి కనుక్కున్నది. వెంటనే ఓ ఎద్దుల బండి కట్టుకొని, కావలసినన్ని సంచులు, పార గట్రా తీసుకొని "పిచ్చిది- ఇది వెళితేనే ఇంత బంగారం వచ్చిందే, నేను వెళితే చాలా బంగారం తెచ్చుకొవచ్చు!" అని దురాశ కొద్దీ బయలుదేరి పోయింది.



సాయంత్రం కల్లా మర్రి చెట్టు దగ్గరికి చేరుకొని, చెట్టు తొర్రలో దాక్కుంది. చీకటి పడ్డాక రాక్షసులు వచ్చి, చెట్టు మీదే పడుకొని నిద్ర పోయారు. వాళ్ళు నిద్రపోవటం చూసి నవ్వుకుంటూ బయటికి వచ్చింది సూరమ్మ. చూస్తే అక్కడి ఇసుకంతా బంగారు రంగులో మెరుస్తోంది! సూరమ్మ "ఓహో! నాకు ముందే తెలుసు ఈ సంగతి. వీళ్లదేమున్నది?!" అని తను తెచ్చుకున్న సంచుల్లోకి ఆత్రంగా ఇసుకని నింపుకోవటం మొదలెట్టింది.

అయితే ఇసకలో దుమ్ము ఉంటుంది కదా, అది కొంచెం ముక్కుల్లోకి పోయేసరికి సూరమ్మ ఇంక ఆపుకోలేక గట్టిగా ఒక్క తుమ్ము తుమ్మింది.

ఆ శబ్దానికి ఉలిక్కిపడి లేచిన రాక్షసులు "ఆహా! సూరమ్మా! నువ్వొస్తావని మాకు ముందే తెలుసు. నువ్వు లేకపోతేనే గదా, మా సుమతి పాప బాగుండేది! ఇదంతా నీ వల్లనే!" అని చటుక్కున సూరమ్మ మీదికి దూకి, గుటుక్కుమనిపించి, సంతోషంగా ఎగిరిపోయారు.

సుమతి కష్టాలు తీరాయి. వాళ్ల నాన్న మళ్ళీ మామూలు మనిషయ్యాడు. వాళ్ల ఇంట్లో మళ్ళీ ఓ సారి సంతోషపు పూలు పూశాయి.



# అపార్థం

*రచన: డి కరుణ, ఆరవ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాల పల్లి.*

రవి, అంజి ఇద్దరూ మంచి స్నేహితులు. ఎదురెదురు ఇళ్ళలోనే ఉండేవాళ్ళు. కలిసి అడుకునేవాళ్ళు; కలిసి తినేవాళ్ళు; కలిసి బడికి వెళ్లడం, కలిసి హోంవర్క్ చేసుకోవటం- ఇట్లా అన్నింటా కలిసి ఉండేవాళ్ళు. వాళ్ల ఇళ్లు వేరు; శరీరాలు వేరు; కానీ 'మనసులు ఒకటే' అన్నట్లు ఉండేవాళ్ళు.

ఇలాంటి వీళ్ళ స్నేహాన్ని చూసి కృష్ణకు అసూయగా ఉండేది. కృష్ణ వాళ్ళు వీళ్ల బజారులోనే, అటు ప్రక్క ఇంట్లో ఉంటారు. వీళ్లు ముగ్గురూ ఒకే తరగతిలో చదువుతున్నారు: రవి, అంజీ- కృష్ణ. వీళ్ళిద్దరూ కృష్ణతో బాగానే మాట్లాడుతారు,

కానీ కృష్ణ మటుకు వీళ్ళతోటే కాదు, అసలు ఎవ్వరితోనూ సరిగ్గా కలవడు. వీళ్లను చూసినప్పుడల్లా "అబ్బా అబ్బా! ఏమి రాసుకొని, పూసుకుంటున్నారో!" అని మనసులో కుళ్లుకునేవాడు కృష్ణ. "ఎలాగైనా సరే, వీళ్ళిద్దరినీ విడదీయాలి!" అని ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాడు.



అందుకే వాళ్లు ఎవరు పలకరించినా కసురుకుంటూ ఉండేవాడు. అయితే, ఒకసారి ఏమైందంటే, బడికి వచ్చేటప్పుడు కృష్ణ పెన్ను మర్చిపోయి వచ్చాడు. వాడు ఇప్పుడు నోట్సు రాసుకోవాలంటే పెన్ను లేదు. ఎప్పుడూ కసురుకునే కృష్ణను చూసి బళ్లో ఎవరూ ఏమీ ఇచ్చేవారు కాదు. మరి వీడు కూడా అంతే; ఎవరినీ ఏమీ అడిగేవాడు కూడా కాదు! రవి, అంజిలను అడిగితే ఇస్తారు గానీ, 'వాళ్ళని అడిగితే ఎలా?' అని అడగడు. లెక్కల సారు వస్తే కొడతాడేమోనని భయం. బాధ. 'సార్ వస్తే తిట్లు తప్పవు.. ఏమంటాడో, ఏమో?!' అనే భయం వాడి మొహంలో కనబడుతున్నది.

ఈ విషయం రవి గమనించాడు: "అయ్యో! వీడేదో టెన్షన్‌లో ఉన్నట్లున్నాడే!" అని, "కృష్ణా! ఏంట్రా? అలా ఉన్నావు? ఏమయ్యింది?" అని ప్రేమగా అడిగాడు.

"ఏం లేదులే. అయినా నీకెందుకే?!" అని కసురుకున్నాడు కృష్ణ.

వాడి సంగతి తెలిసిన రవి, వాడి ప్రక్కవాళ్లను అడిగి విషయం తెలుసుకున్నాడు. తన దగ్గర ఉన్న రెండు పెన్నులలో ఒక దాన్ని తీసి కృష్ణకు ఇవ్వబోయాడు చిరునవ్వుతో. అభిమానంతో కృష్ణముఖం ఎర్రబడింది. "నీ సాయం నాకేమీ అవసరం లేదు" అని చెప్పబోయాడు. అయితే అంతలోనే లెక్కల

సారు అప్పుడే క్లాసులోకి వస్తూ కనిపించాడు. తప్పనిసరి పరిస్థితి.. తను అటు పెన్ను తీసుకున్నాడు; ఇటు సారు లోపలికి అడుగు పెట్టాడు.

ఆ తరువాత బడి వదిలేంతవరకూ కృష్ణ మనసులో ఆలోచనలు రేగాయి. 'నేను వీళ్లను శత్రువుల్లాగా చూసినా, వీళ్ళు మాత్రం నన్ను స్నేహితుడి లాగే చూస్తున్నారు' అని కృష్ణకు అర్థమయ్యింది. 'వీళ్ళు నాపట్ల మంచితనాన్నే ప్రకటిస్తున్నారు..కానీ తనేం చేస్తున్నాడు? తన ప్రవర్తనతో వీళ్ళను ప్రతిసారీ చిన్నబుచ్చుతున్నాడు!"

తెలియకుండానే అతని కళ్లలో నీళ్లు తిరిగాయి. ఆ రోజంతా బడిలో కాస్త ముభావంగానే ఉన్నాడు కృష్ణ.

సాయంత్రం ఇంటికి వెళ్ళాక, రవి-అంజిలు కలిసి హోంవర్క్ చేసుకుంటుంటే, దగ్గరికి వెళ్లాడు. "సారీ, రవీ! నేను మీతోటి చాలా కఠినంగా మాట్లాడుతూ వచ్చాను. నన్ను క్షమించు" అన్నాడు.



అతనిలోని మార్పును అర్థం చేసుకున్న అంజి, రవి ఇద్దరూ కృష్ణను సమాధాన పరచారు. "ఏమున్నదిరా, స్నేహితుల మధ్య క్షమాపణలేవీ అక్కర్లేదు. కలిసి సంతోషంగా ఉందాం, ఒకరికొకరం సాయం చేసుకుందాం" అని చెప్పారు. ఆ తర్వాత ఇక ముగ్గురూ మంచి స్నేహితులు అయ్యారు!



**స్క్రూ లూజు!**

టీచరు : ఏంట్రా, నీ తలకు ఆ గాటు?!

రాము (ఏం చేస్తున్నావు? అని తప్పుగా వినబడి..) : స్క్రూ టైట్ చేస్తున్నాను టీచర్!

*-హేమవర్షిణి, ఐదో తరగతి, వికాస విద్యా వనం*

# రెంటికీ చెడ్డ రేవడి

*రచన: డి. ఫణీంద్ర, ఐదవ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాల పల్లి.*



అనగనగా ఒక అడవిలో ఒక సింహం. దానికి ఒకసారి చాలా ఆకలి వేసింది. ఎప్పుడూ దాని వెంట తోడుగా ఉండి, ఎప్పుడు ఏం చేయాలో చెప్పే మంత్రి- నక్క, ఆ రోజున ఇంకా రాలేదు.

'ఈ మంత్రికి ఏమయిందో! ఈరోజు ఇంకా రాలేదు?!' అనుకుంటూ చాలాసేపు ఎదురు చూసిందది. చివరికి "అయ్య బాబోయ్! నాకు అకలి దంచేస్తోంది- ఇంక లాభం లేదు. నేనే ఏమైనా ఆహారం వెతుక్కోవాలి!" అనుకుంటూ గుహలోంచి బయటికి వచ్చింది.



ఆహారం కోసమని అటూ-ఇటు చూసింది. అదృష్టం! దగ్గరలోనే కుందేలు ఒకటి కనబడింది.

'హమ్మయ్య కష్టపడకుండానే దొరికిందిరా కుందేలు! దీన్ని చంపి నా ఆకలి తీర్చుకుంటాను" అని రెండడుగులు ముందుకు వేసింది సింహం.

కానీ, అంతలోనే దానికో అనుమానం వచ్చింది-'ఈ కుందేలు నా ఆకలికి ఏం సరిపోతుందబ్బా?! ఇంత చిన్న ప్రాణిని చంపితే నా లాంటి రాజుకు మర్యాద ఏముంటుంది? మరి దీనిని చంపనా, వద్దా?!" అని.



అట్లా అది ఆ ఆలోచనలో ఉండగానే, మరి కొంచెం దూరంలో ఓ చెట్టు క్రింద కనపడింది ఒక జింక. 'ఆఁ!..అదిగో..అక్కడ ఉంది! జింక! నాలాంటి దానికి అదీ, ఆహారం అంటే..!"అనుకుంది సింహం.

ఆ ఆనందంలో దాన్ని పట్టుకుందామని గబగబా దాని వైపుకు పరుగెత్తింది. సింహం కదలికను చూడగానే ప్రాణాలు అరచేతపట్టుకొని చెంగున పొదలు దాటేట్లు దూకి, మెరుపులాగా మాయమైంది జింక!

సింహానికి బుద్ధి వచ్చింది. "ఓసి! ఎంత చలాకీగా తప్పించుకున్నావే?! మళ్ళీ చెబుతాను నీ సంగతి! హుంఁ.. ఆకలి మాత్రం దంచేస్తూన్నది! దూరం పోయే ఓపిక లేదు! సరేలే కానియ్యి.. మంత్రి వచ్చే దాకా కుందేలుతోటే సరి పెట్టుకుంటాను!" అనుకున్నది.

తీరా చూస్తే అక్కడ ఆ కుందేలు కూడా లేదు!!

రవి: ఏమయ్యా! సినిమా హాల్లో పొగ త్రాగకూడదని తెలీదా?
వెంగళప్ప: క్షమించాలి సార్, నేను పొగ త్రాగటం లేదు- వదులుతున్నాను.



సుబ్బయ్య:ఈ బస్సు ఎక్కడెక్కడ ఆగుతుంది?
వెంగళ్: బ్రేక్ వేసిన చోటల్లా.

బిచ్చగాడు: అమ్మా భిక్ష!
ఇల్లాలు: పనిలో ఉన్నాను- అలా గడప దగ్గర పెట్టి వెళ్లు నాయనా!!

# బొమ్మలు-పదాలు 3

***రెండో తరగతి పిల్లలకు ప్రత్యేకం :*** *ఇక్కడ పది బొమ్మలున్నై. ఒక్కో బొమ్మనుండీ* ***రెండు-లేక-మూడు అక్షరాల పదాలు*** *తయారవుతాయి- చూడండి. వింత ఏంటంటే ఆ పది పదాలూ 'ఇ ' తోటే మొదలౌతున్నై! బొమ్మల్ని చూసి పదాలు కనుక్కోండి మరి !*

*నిర్వహణ : శ్రీమతి ఆదూరి హైమావతి, అమెరికా సంయుక్త రాష్ట్రాలు*



1



2



3




4



5



6



7

"బొమ్మలు-పదాలు 1 నుండి బొమ్మలు-పదాలు 6" వరకూ వచ్చిన పదాలన్నీ దాచి పెట్టుకోండి. చివరికి, అన్నిటినీ ఓ పోస్టు కార్డు మీద రాసి పంపాలి మాకు! అట్లా అన్నీ సరిగా రాసి పంపిన **రెండో తరగతి పిల్లల్లో** లాటరీ ద్వారా ఎంపికైన **ఇద్దరికి** - ఒక్కొక్కరికీ 500 రూ. బహుమతి ఇవ్వబడుతుంది !

# బొమ్మకు కథ రాయండి

*ఈ బొమ్మని చూడండి. కొండ గుహ ముందు గుర్రాలెక్కిన మనుషులు. గుహముందు నిలబడి మంత్రాలు చదువుతున్న మనిషి. చెట్టు మీదినుండి రహస్యంగా చూస్తున్నవాడొకడు.. చూస్తుంటే ఇదేదో ఆలీబాబా కథలాగా లేదూ?! అయితే దీనికి సరిపోయేట్లు మీరేదైనా కొత్త కథ రాసి పంపగలరేమో చూడండి. బాగున్న కథని కొత్తపల్లిలో ప్రచురిస్తాం!*



కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి (గ్రామం&మండలం), అనంతపురము జిల్లా, ఆంధ్రప్రదేశ్-515101. ఫోన్: 7702877670

రాము: ఏంట్రా, ఆ అక్క నిన్ను అట్లా కొట్టింది?!

సోము: ఏమోరా! నేను ఆ అక్క కాలు తొక్కి 'సారీ' కి బదులు 'నెవర్‌మైండ్' అన్నా- అంతే!

*-హేమవర్షిణి, ఐదో తరగతి, వికాస విద్యా వనం*



# నిజాయితీ

*సేకరణ: పి. అనిత, తుమ్మ చెట్ల పల్లి, అంగళ్ళు పోస్టు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

చాలా ఏళ్ల క్రితం- కలియుగం ప్రారంభంలో, ఒకానొక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతను చాలా నిజాయితీ పరుడు. మెల్ల మెల్లగా డబ్బును కూడబెట్టి, చివరికి ఒక భూస్వామినుండి కొంత భూమిని కొనుక్కున్నాడు. భూమి పూజ చేసాక, భార్య-కూతురు సాయంచేస్తుండగా, తను కొత్తగా కొనుక్కున్న ఆ భూమిని దున్నటం

మొదలు పెట్టాడు.

అకస్మాత్తుగా 'ఖణేల్'మని శబ్దం వచ్చింది. నాగలి దేనికో తట్టుకొని ఆగిపోయింది. 'ఏదో బండ అయి ఉంటుంది' అనుకున్న రైతు, నాగలిని తప్పించి, అక్కడ త్రవ్వాడు. అతని కుమార్తె అక్కడి మన్నుని తొలగించి చూసింది- ధగ ధగా మెరిసే బంగారు నాణాలతో నిండిన రాగి బిందె ఒకటి కనిపించిందక్కడ!

దాన్ని చూసి రైతు, అతని భార్య-బిడ్డ ముగ్గురూ నిశ్చేష్టులైపోయారు. ఈ రోజుల్లోనైతే 'భూమిలో దొరికే ప్రతి నిక్షేపమూ ప్రభుత్వానికే చెందుతుంది' అని చట్టాలు ఉన్నాయి. కానీ ఆరోజుల్లో అలాంటివేమీ లేవు. రైతు చప్పుడు చేయకుండా దాన్ని మొత్తాన్నీ కైవశం చేసుకుంటే ఎవ్వరూ అడిగే వాళ్ళు లేరు!

కానీ నిజాయితీగల ఆ రైతు బంగారాన్ని సొంతం చేసుకునేందుకు ఇష్టపడలేదు. "మనం భూస్వామి దగ్గర కొన్నది భూమిని మాత్రమే; లోపల దొరికిన సంపదని కాదు కదా! మనకి దొరికిన ఈ లంకెబిందె భూస్వామిదే అయి ఉండాలి" అన్నాడు.

"అవును. మనది కాని సొత్తుని మనం తీసుకోకూడదు. ఈ బిందెను నా తలపైకి ఎత్తు- తీసుకెళ్ళి భూస్వామికి ఇచ్చి వద్దాం" అన్నది రైతు భార్య.

సరేనని రైతు బిందెను ఎత్తుతుండగా రైతు కుమార్తె అన్నది- "నాన్న గారూ! రాగి బిందెను నేను మొదట చూశాను. కనుక ఆ బిందెను నేను ఎత్తుకుంటాను" అని.

"నువ్వు చిన్న దానివి కద తల్లీ, ఇటువంటి బరువు పని నీకు ఎందుకు?" అన్నాడు తండ్రి.

"నాన్న గారూ! నేను పాలు, పెరుగు, మీగడ, నెయ్యి సమృద్ధిగా తిన్నదాన్ని. కనుక నాకు చాలా బలం ఉంది" అని రైతు కుమార్తె ఆ బిందెను ఎత్తి తన తలపైన పెట్టుకున్నది.

అట్లా వాళ్లు ముగ్గురూ భూస్వామి ఇంటికి వెళ్లారు.

రాగి బిందెను మోసుకొని వస్తున్న రైతు కుమార్తెను చూసి భూస్వామి అడిగాడు- "ఏమి జరిగింది తల్లీ?!" అని.

రైతు భూస్వామికి సంగతంతా చెప్పి, "భూమిని త్రవ్వింది నేను, నాకు సాయం చేసింది నా భార్య, బిందెని మొదట చూసింది నా కుమార్తె. ముగ్గురం కలిసి, సమ్మతంగా నీ సొత్తును నీకు తెచ్చి ఇస్తున్నాం. స్వీకరించు" అన్నాడు.

భూస్వామి ఆలోచనలో పడ్డాడు. "అట్లా కుదరదు గదా; నేను భూమిని నీకు అమ్మేసాను. ఇక దానితో నాకు ఏలాంటి సంబంధమూ ఉండదు. ఆ భూమికి యజమానివి నువ్వే. ఆ భూమిలో లభించినది ఏదైనా నీకే సొంతం అవుతుంది. ఈ బిందెను నువ్వు నాకు ఇవ్వాల్సిన అవసరం ఏమాత్రం లేదు. అది పూర్తిగా నీదే" అన్నాడు.

రైతు దానికి అభ్యంతరం చెప్పాడు: "నేను భూమిని మాత్రమే కద, కొన్నది?! భూమిలో లభించిన లంకెబిందెను తీసుకునే అధికారం నాకు ఎలా వస్తుంది? ఈ బిందె మీకే చెందాలి" అన్నాడు. వివాదం పెద్దదైంది.

అక్కడ చేరినవాళ్ళు ఎవ్వరూ ఈ సమస్యను పరిష్కరించలేకపోయారు. దాంతో అందరూ కలిసి ప్రభువైన ధర్మరాజు వద్దకు వెళ్ళారు.



రైతు నిజాయితీని, భూస్వామి ధర్మ నిరతినీ మెచ్చుకున్నాడు ధర్మరాజు. "నా రాజ్యంలో

మీలాంటి వాళ్ళు ఉండడం నాకు గర్వకారణం. అయితే ఈ సమస్య చాలా జటిలమైనది. ఏ విధంగా పరిష్కరించినా సూక్ష్మమైన ధర్మానికి నష్టం వాటిల్లే అవకాశం ఉన్నది. అందువల్ల, మరి- ఇరు పక్షాల వాళ్ళూ నా తీర్పుకు కట్టుబడి ఉంటామని మాట ఇస్తే, అప్పుడు నా అభిప్రాయాన్ని వెలువరిస్తాను"అన్నాడు.

రెండు కుటుంబాల వాళ్ళూ, "మీరు ఎట్లా చెబితే అట్లా చేస్తాం" అన్నారు.

"సరే! అయితే నా తీర్పు వినండి. రైతు కుమార్తెను భూస్వామి కుమారుడు వివాహమాడాలి. బంగారు నాణాలతో నిండిఉన్న ఈ రాగి బిందె, మీ వివాహ సందర్భంగా మీ తల్లిదండ్రులు మీకిస్తున్న బహుమతి అవుతుంది" అన్నాడు ధర్మరాజు. రాజుగారి తీర్పుకు అందరూ సంతోషించారు.

## స్వాగతం!

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులుగా అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. మీకు తెలిసిన పిల్లలందరికీ కొత్తపల్లిని పరిచయం చేయండి. శక్తి ఉన్న పిల్లలచేత, లైబ్రరీల చేత చందాలు కట్టించండి. మీరు చదివిన బడులకు కొత్తపల్లి సెట్లను బహూకరించండి. మీరు పనిచేసే సంస్థల ద్వారా కొత్తపల్లిని పదిమందికి పరిచయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !



# పాదపూజ

శ్లోక చమత్కారం-3

*రామాయణ కావ్యాన్ని వాల్మీకి మహర్షి వ్రాశాడు- తెలుసు కదా? వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తూ, అనేకమంది కవులు గొప్ప కావ్యాలను రచించారు. అలా రాయబడిన కావ్యాల్లో 'ఆధ్యాత్మరామాయణం' ఒకటి. అందులోని చమత్కారం యిది...* ***రచన, నిర్వహణ: ఇ యస్ వి రవి, అనంతపురం.***

అయోధ్యకు యువరాజు రాముడు, 'సాక్షాత్తు విష్ణువు అవతారమే' అని చెప్పుకునేవాళ్ళు.

ఇంకా పిల్లవాడుగా ఉండగానే ఆయన తాటకి అంతటి గొప్ప రాక్షసిని హతం చేసాడు. విశ్వామిత్రుడి యాగాన్ని అడ్డుకుంటున్న సుబాహుడిని చంపేసాడు; మారీచుడిని ఏడు సముద్రాల అవతలికి

విసిరేసాడు.

అట్లా ఆయన విశ్వామిత్రుడి వెంట నడుస్తూ పోతుంటే, గౌతమఋషి ఆశ్రమం దగ్గర ఆయన పాదం సోకిన ఓ బండరాయి కాస్తా చక్కని యువతిగా మారిపోయింది!



ఆమె అహల్య- స్వయానా గౌతమఋషి భార్య; అయితే శాపం కారణంగా చాలా కాలంగా ఆమె అలా రాయిలా పడి ఉండింది; గౌతముడు కూడా ఆ ఆశ్రమాన్ని విడిచి పెట్టేసి మరో చోటుకు వెళ్ళిపోయాడు. ఇంత కాలానికి, రాముడి పాదం సోకటం వల్ల ఆమె శాపం తీరింది. రాముడికి ధన్యవాదాలు చెప్పుకొని, తిరిగి గౌతముడి దగ్గరికి వెళ్ళిపోయింది ఆమె.

ఈ ఉదంతం ఆ నోటా ఈ నోటా చుట్టు ప్రక్కల అందరికీ పాకింది. శ్రీరామ పాదపు గొప్పతనం గురించి ప్రజలంతా కథలు కథలుగా చెప్పుకోసాగారు.

ఆ తర్వాత కొన్నేళ్లకు రాముడు, సీత, లక్ష్మణుడు వనవాసానికి పోతూ గంగానది ఒడ్డుకు చేరుకున్నారు.

అక్కడికి దగ్గర్లో 'శృంగిబేరపురం' అనే ఊరు ఉంది. 'గుహుడు' అనే యువకుడు ఒకడు అక్కడ గంగమీద పడవ నడుపుకుంటూ ఉన్నాడు. చూడగానే గుహుడు రాముడిని గుర్తుపట్టాడు- చాలా గౌరవించాడు. అడవిలో దొరికే పండ్లు,తేనె అర్పించి మొక్కాడు; 'నేను నీకు ఏం సేవ చేయాలో చెప్పు' అన్నాడు.

"పెద్ద పని ఏమీ కాదు- కాస్తంత ఈ గంగ దాటించు, చాలు-"అన్నాడు రాముడు.



గుహుడు కొంచెం సంకోచించినట్లు అనిపించాడు. తటపటాయిస్తున్నట్లు, ఇలా అన్నాడు:

"పాదాంబుజం తే విమలం హి కృత్వా
పశ్చాత్ పరం తీరమహం నయామి |
నో చేత్తరీ సద్యువతీ మలేన స్యాచ్చేత్
విభో విద్ధి కుటుంబ హానిః ||"

"-ఓ రామయ్యా! నీ పాదం తగిలి, ఇదివరకే ఓసారి రాయి కాస్తా అమ్మాయిగా మారింది. ఇప్పుడు మళ్ళీ నా పడవ కూడా అమ్మాయిలా మారిందనుకో, అప్పుడు నాకు రెండు కష్టాలు: ఒకటి - పడవ పోతే, నా జీవనాధారం పోతుంది. రెండు - పడవ అమ్మాయిగా మారి, ఆ అమ్మాయిని ఇంటికి తీసుకెళితే నా భార్య నన్ను తరిమేస్తుంది. అందుకని, ముందు నీ పాదాలు రెండూ బాగా కడుగనివ్వు. ఆ తర్వాత నా పడవని ఎక్కుదువుగాని" అని.

తన కోరికను అంత చక్కగా వెలువరించిన గుహుడిని రాముడు కరుణించాడు. మనసారా శ్రీరాముని పాదాలను కడిగి ధన్యుడయ్యాడు గుహుడు.



# అనాన్సీ భూమి మీదకి కథలు ఎట్లా తెచ్చాడు?

***ఘనా దేశపు జానపద కథ.***

*పశ్చిమ ఆఫ్రికా కథల్లో వచ్చే అనాన్సీ ఒక్కోసారి మనిషి, ఒక్కోసారి సాలీడు. కానీ ఎట్లా వచ్చినా వాడు మొత్తం మీద ఎప్పుడూ చాలా తెలివైన వాడే, గొప్ప కోప్పిష్టివాడే! ఈ కథలో వాడు మన ప్రపంచానికి కథల్ని ఎట్లా తెచ్చాడో తెలుస్తుంది.*

***సౌజన్యం : బెర్టీ,* storynory.com**

ఆకాశాలన్నింటికి రాజు న్యాన్‌కోపాన్. ఆ పేరుకు అర్థం "అన్నీ తెలిసిన వాడు, అన్నీ చూసేవాడు" అని. అతని కుడి కన్ను సూర్యుడు. పగటి పూట అతను దాన్ని తెరుస్తాడు. అతని ఎడమ కన్ను చంద్రుడు. దాన్ని అతను రాత్రి పూట తెరుస్తాడు.

మొదట్లో కథలన్నీ న్యాన్‌కోపాన్ దగ్గరే ఉండేవి. కానీ ఆ రోజుల్లో భూమి మీద నివసించే సాధారణ ప్రాణి- అనాన్సీకి గొప్ప ఆత్మ విశ్వాసం ఉండేది. తన సామర్థ్యం

మీద తనకు చాలా నమ్మకం ఉండేది. తన తెలివి తేటల మీద, చాతుర్యం మీద అనాన్సీకి గొప్ప నమ్మకం ఉండేది.

"కథలన్నీ న్యాన్‌కోపాన్ దగ్గర ఉంటే ఎట్లా" అనుకున్నది అనాన్సీ. "నేను అంతకంటే గొప్ప కథల్ని అల్లగలను.." అట్లా అనుకొని, అనాన్సీ భూమి మీద ఉండే అతి పెద్ద చెట్టు పైకెక్కి, ఆకాశ దేవుడితో నేరుగా మాట్లాడింది: "న్యాన్‌కోపాన్! నువ్వు నీ కథలన్నీ నాకు ఇచ్చేయచ్చుగా? నేను వాటిని నీకోసం చాలా చక్కగా కాపాడి పెడతాను" అన్నది.

న్యాన్‌కోపాన్ తన సూర్య నేత్రంతో ఈ చిట్టి-పొగరుబోతు- సాలీడును చూసాడు. "హీ హీ హీ" అని మెల్లగా నవ్వుకున్నాడు.

"ఓ దానిదేముంది అనాన్సీ! నీకు ఎన్ని కథలు కావాలంటే నీకు అన్ని కథలు తీసుకోవచ్చు. కానీ అంతకంటే ముందు నువ్వు చేయాల్సిన పని ఒకటి ఉన్నది. నేను కోరిన మూడు వస్తువులు తెచ్చిపెట్టాలి నాకు".

"ఏంటా మూడు?" అడిగింది అనాన్సీ.

"ఊఁ.. ఊఁ.." అంటూ ఆలోచించాడు న్యాన్‌కోపాన్.



"కొండ చిలువ-ఆనిని, చిరుత పులి-ఆసిబోని, ఇంకా కందిరీగలు మోబోరోని-ఈ మూడూ తెచ్చిపెట్టు చాలు" అన్నాడు న్యాన్‌కోపాన్, "హో హో హో" అని పెద్దగా నవ్వుతూ. వేలెడంత లేని ఈ పురుగు, 'భయంకరమైన అతి పెద్ద జంతువుని తేవటం' అన్న అలోచనకే అతనికి నవ్వు ఆగలేదు.

కానీ అనాన్సీకి ఈ పందెం చాలా నచ్చింది. "సరే" అన్నదది. "పందెం అంటే పందెమే".

అట్లా అది తన ఎనిమిది కాళ్ల మీద

ప్రయాణం మొదలుపెట్టింది- కొండ చిలువను, చిరుత పులిని, కందిరీగను పట్టుకొచ్చేందుకు.

పోతూ పోతూ ఉంటే దట్టమైన అడవి ఒకటి వచ్చింది. అక్కడ అనాన్సీ బాగా వెతికి, పొడుగ్గా-సూటిగా ఉన్న కట్టెనొకదాన్ని ఏరుకున్నది. ఆ తరువాత అది దాన్ని తీసుకెళ్లి, కొండ చిలువ ఉండే ఇంటి ముందు స్థలంలో పడేసి, ఆ కట్టె ప్రక్కన కూర్చున్నది.



ఆ రోజు సాయంత్రం కొండచిలువ ఇంటికి తిరిగొచ్చే సమయానికి దాని ఇంటి ముందు ఈ కట్టె, దాన్ని సునిశితంగా పరిశీలిస్తున్న అనాన్సీ కనిపించాడు దానికి!

"ఎనిమిది కాళ్ల సోదరా! ఇక్కడ ఏం చేస్తున్నావు?!" అని అడిగింది కొండ చిలువ.

"ఏం చెప్పను, నా కష్టాలు?!" అన్నది అనాన్సీ. "న్యాన్‌కోపాన్ తో ఒక పందెం వేసుకోవాల్సి వచ్చింది. 'నువ్వు ఈ కట్టె కంటే పొడుగు' అని నేను- 'కాదు- పొట్టి!' అని ఆయన! ప్రపంచంలో ఉన్నవన్నీ గమనించుకునే ఆయనకి 'నువ్వు తప్పు స్వామీ!' అని నిరూపిస్తే చాలు కదా అని ఇట్లా వచ్చా!" అన్నది అనాన్సీ.

కొండ చిలుక ఆనినికి పొడవాటి తన శరీరం అంటే చాలా ఇష్టం; దాన్ని బాణం లాగా నిక్కదీసి, నిటారుగా పడుకోవటం అంటే ఇంకా చాలా ఇష్టం. అందుకని అది 'తను ఆ కట్టె కంటే పొడవు' అని చూపించుకోవటం కోసం వెళ్లి దాన్ని ప్రక్కన పడుకున్నది.

మెరుపు వేగంతో అనాన్సీ తన చుట్టూ గూడు కట్టేస్తుందని గాని, తనను నిలువుగా

ఆ కట్టెకు కట్టేస్తుందని గానీ అస్సలు ఊహించలేదు అది! కానీ ఇప్పుడు ఏం చేయగలదు పాపం, ఏ మాత్రం కదిలేకి లేకుండా ఉంది. అది ఇప్పుడు చేయగలిగిందల్లా తన పొడవైన వెండి నాలుకని గడ గడ లాడిస్తూ "జిత్తులమారి అనాన్సీ! నా కట్లు విప్పు! లేకపోతే చూసుకో!" అనటమే.



కానీ అనాన్సీ దాని మాటలు పట్టించుకోకుండా ఆకాశంకేసి చూసి "న్యాన్‌కోపాన్! పందెంలో మొదటి భాగం గెలిచాను! ఆనినిని నీకిస్తున్నాను!" అన్నది.

ఆకాశం నుండి న్యాన్‌కోపాను "నిజంగానే నువ్వు ఓ జిత్తుల మారి పురుగువి అనాన్సీ! ఎట్లాగో శ్రమ పడి దీన్ని పట్టుకున్నావు కానీ, మెరుపు వేగంతో పరిగెత్తే చిరుత పులి ఆసెబో నీ పాల పడదు- చూసుకో!" అన్నాడు.

"చూద్దాం" అన్నది అనాన్సి. కానీ 'చూడటం' అనేది అసలు దాని పథకంలో భాగం కానే కాదు. తన ఎడమ కంటిని అది ఇప్పుడు పూర్తిగా కుట్టేసుకున్నది- ఆ కంటితో ఇక ఏమీ కనిపించదు. ఆపైన ఆ ఒంటి కన్ను సాలీడు అడవిలో ముందుకు పోయి, చిరుత పులి ఆసెబో నివాసం ఉండే చెట్టు కిందికి చేరుకున్నది.

చెట్టు కొమ్మ మీద కులాసాగా పడుకొని, కాళ్లు-పంజాలు కిందికి విలాసంగా జారవిడిచిన చిరుత పులి దాన్ని చూసి "ఏయ్ అనాన్సీ! జిత్తుల మారి అనాన్సీ! నీ కంటికి ఏమైంది?!" అని అడిగింది.

జిత్తులమారి సాలీడు "అయ్యో, ఏమి చెప్పమంటావ్! న్యాన్‌కోపాన్ నా కంటిని మూసి కుట్టేసాడు! అయితేనేమిలే,

ఇప్పుడు నేను అద్భుతమైన వస్తువులన్నింటినీ చూడగల్గుతున్నాను. ప్రపంచాలు, నక్షత్రాలు- మొత్తం విశ్వం అంతా- నా కళ్ల ముందు ఆటలు ఆడుతున్నది. బహుశా దేవతలంతా ఇట్లానే చూస్తారేమో!" అన్నది ఆశ్చర్యపోతున్నట్లు.



"వావ్! ఇది నిజంగా దైవత్వమే!" నిర్ఘాంతపోయింది చిరుత పులి ఆసెబో. "కొంచెం నా కన్ను కూడా కుట్టేయరాదూ, ఆ అద్భుతాలేవో నేనూ చూస్తాను?!" అన్నది.

"నేను దాని కంటే ఇంకా మంచి పనే చేయగలుగుతాను" అన్నది అనాన్సీ. "నేను నీ రెండు కళ్ళూ కుట్టేస్తాను. దాంతో నువ్వు ఇక అన్ని రకాలుగానూ పూర్తిగా దేవుడివే అయిపోతావు!"

అది తన పని పూర్తి చేసే సరికి పాపం ఆసెబో పూర్తిగా గుడ్డిదైపోయింది. దాన్ని న్యాన్కోపాన్ దగ్గరికి నడిపించుకెళ్లటం మరింత సులభం అయిపోయింది.

"ఊఁ..సరే..సరే..సరే!" అన్నాడు న్యాక్రోపాన్. "చిట్టి జిత్తులమారి సాలీడు పిల్లా! నేను నీ తెలివి తేటలని బహుశా కొంచెం చిన్న చూపు చూసినట్టున్నాను.. కానీ ఇప్పుడే ఏమైంది? నీకు మిగిలి ఉన్న మూడో పని అన్నిట్లోకీ అతి కష్టమైన పని! ఎందుకంటే ఆ కందిరీగల కోపం ఎంత భయంకరమైనదంటే, వాటిని ఇప్పటి వరకూ ఎవ్వరూ లొంగదీసుకోలేకపోయారు!"

"వాటిని నీ దగ్గరకు తెస్తానని నేను పందెం కాసాను; వాటిని తెచ్చి తీరుతాను!"

జవాబిచ్చింది అనాన్సీ, స్థిరంగా. కానీ ఆ కందిరీగల కోపం ఎట్లాంటిదో తెలిసిన న్యాన్‌కోపాన్ మటుకు, దీని మూర్ఖత్వాన్ని చూసి జాలిపడ్డాడు.

అనాన్సి ఆ మొబోరో కందిరీగలు కట్టుకున్న గూడు దగ్గరికి పోయాడు; తనతో పాటు ఓ పెద్ద గాజు జాడీనొకదాన్ని తీసుకెళ్లాడు. దాన్ని చూడగానే కందిరీగలన్నీ అనాన్సీ చుట్టూ మూగి 'బజ్' మంటూ "ఆ జాడీలో ఏముంది అనాన్సీ?!" అని అడిగాయి.

"ఊఁ..ఊఁ..ఏమీ లేదు!" జవాబిచ్చింది అనాన్సీ. "న్యాన్‌కోపాన్‌తో నేను ఒక పందెం కాశాను.

'మీరు ఎక్కడికైనా ఎగరగల్గుతారు గానీ ఈ జాడీలోకి మాత్రం ఎగరలేరు' అని ఆయనంటాడు. 'మీరు ఎక్కడికైనా ఎగురుతారు- చివరికి జాడీలోకి కూడా ఎగర గలరు" అని నేనంటాను. 'ఆయనే తప్పు' అని నా నమ్మకం; కానీ మీరు ఆ సంగతిని నిరూపించగలరా?"

"ఓఁ..దానిదేముంది?! మేము జాడీలోకి కూడా ఎగరగలం!" అన్నాయి కందిరీగలు కోపంగా. "అసలైనా మేం ఏం చేయగలమో, ఏం చేయలేమో చెప్పేందుకు ఆయనెవరు?! అస్సలు మమ్మల్ని ఏమనుకుంటున్నాడు ఆయన?" అని అరిచాయి అవి.



తమ మాటను నిరూపించుకోవటం కోసం అన్నీ ఒక జట్టుగా జాడీలోకి దూరాయి. ఒకసారి చివరి కందిరీగ వరకు లోనికి పోగానే జాడీ మూత పెట్టేశాడు అనాన్సీ.

మోబోరో కందిరీగల్ని కూడా తెచ్చిన అనాన్సీ

తెలివి తేటల్ని చూసి న్యాన్‌కోపాన్ నిజంగానే ఆశ్చర్యపోయాడు. 'ఇంత చిన్న పురుగు, ఇంత భయంకరమైన కందిరీగలను పట్టుకోగలుగుతుందని ఎవరు అనుకోగలరు?' "నిజంగా, అనాన్సీ! నువ్వు నీ శక్తియుక్తుల్ని నిరూపించుకున్నావు! భూమి మీద ఉన్న జంతువులన్నిటిలోనూ నువ్వు గొప్పదానివని నిరూపించుకున్నావు! ప్రపంచంలోని కథలన్నిటినీ అల్లేందుకు కావలసిన అర్హతను సంపాదించుకున్నావు" అని ఆశీర్వదించాడు న్యాన్‌కోపాన్.

ఆ విధంగా అనాన్సి సాలీడు ప్రపంచంలోని కథలన్నిటినీ తెచ్చుకున్నది. ప్రపంచంలోవి అన్నీ కాకపోయినా, కనీసం ఘనాలోని కథలన్నీ అయితే వచ్చేసుంటాయి దాని దగ్గరికి.

ఆ తర్వాత అది ఆ కథల్నే ఇంకా ఇంకా అల్లుతూ పోయింది. అల్లుతూ పోయింది.. అట్లా కథలు అల్లుతూ అది ఎంత దూరం పోయిందంటే, తను వాటిని ఎక్కడెక్కడ అల్లిందో కూడా పూర్తిగా మర్చిపోయింది!

**కాలం ఆగదు!**

టీచర్: ఒరే రాముా! 1869లో ఏమైందిరా?

రాము: గాంధీ మహాత్ముడు పుట్టాడు టీచర్!

టీచర్: వెరీ గుడ్! మరి 1873లో ఏమైంది, చెప్పు!

రాము: గాంధీ మహాత్ముడికి నాలుగేళ్లు వచ్చాయి టీచర్!

**మా నాయనే!**

టీచర్: మనం నీళ్ళు ఎందుకు తాగుతున్నాం చింటూ?

చింటూ: నీళ్లను తినలేం కద టీచర్, అందుకని త్రాగుతాం.

తల్లి: ఏమిట్రా! అట్లా ఎడమ చేత్తో తింటున్నావు?!

కొడుకు: పాత పాటలు మంచివని నువ్వే అన్నావు కదమ్మా?

తల్లి: అవును, ఇప్పుడేమైంది?

కొడుకు: "కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్" అని విన్నా, ఇందాకే!





# మంచి మనసు

*రచన: శ్రీ చొప్పా వీరభద్రప్ప, అనంతపురం.*

అనగనగా ఒక పొలం కాపు, తన పొలంలో తెల్లజొన్న వేశాడు. అది కాపుకొచ్చింది. జొన్న కంకులు గుత్తులు కట్టుకొని మినమిన లాడుతున్నాయి.

సరిగ్గా ఆ సమయంలో పంటను ఆశించినై, చాలా గువ్వలు- అన్నీ గుంపులు గుంపులుగా కంకులమీద వాలినై. లేలేత- పాల విత్తనాలను కొట్టేయటం మొదలెట్టాయి.

ప్రతి సారీ ఇట్లాగే జరుగుతూంది పొలం కాపుకి. ఈ పిట్టలతో అతనికి మా పెద్ద తంటా వచ్చిపడింది- ఎక్కడలేని నష్టం కలిగిస్తున్నాయవి. కంకులు తయారైన-

ప్పటినుండి పొలంకాపుకి ఈ పిట్టలతో ఒకటే బాధ-

కొందరు సలహా ఇచ్చారు: పంటకు పురుగు మందులు చల్లమని. కానీ పొలం కాపు పాపం, చాలా మంచివాడు. అట్లా చేస్తే గువ్వలు చచ్చిపోతాయని అతనికి తెలుసు. అదీగాక 'అట్లాంటి జొన్నలు తింటే మనుషులు కూడా చాలా రోగాల బారిన పడతారు' అని అతను వాళ్ళ మాటలు పట్టించుకునేవాడు కాదు.



కానీ ఈ పిట్టలతో వేగేది ఎలాగ? బాగా ఆలోచించి, అతను పొలం మధ్యన, ఎత్తుగా కంచె ఒకటి ఏర్పాటు చేసాడు. దానిపైకెక్కి నిల్చుని, గట్టిగా అరుస్తూ, చేత్తోటి రాళ్ళు విసురుతూ గువ్వల్ని తోలటం మొదలు పెట్టాడు.

మంచె మీద ఓ రేకు డబ్బా పెట్టుకొని, దానిపైన కర్రతో కొడుతూ డబడబా శబ్దం చేసేవాడు. ఆ శబ్దానికి భయపడి గువ్వలు ఎగిరి పోయేవి- కానీ కొంచెం సేపు అటూ ఇటూ తిరిగాక, వాటి భయం తగ్గగానే మళ్ళీ వచ్చి కంకులమీద వాలేవి. ఇట్లా ఆ గువ్వల వ్యవహారం సాగుతూ పోయేది.

ఒక్కోసారి అతను ఒక వడిసెల తీసుకొని, దానిలో రాయి పెట్టి, వడిసెలను గుండ్రంగా తిప్పి, రాయిని పొలం మీదికి విసిరేవాడు.

అలాంటి రాళ్ళు వేగంగా ఆకాశంలో శబ్దం చేస్తూ పోతుంటే, 'అవి వచ్చి తమకు తగిల్తే ఎలారా దేవుడా' అని భయంతో గువ్వలు దూరంగా ఎగిరి పోయేవి. అయినా ఒక సారి వడిసెల తిప్పటం ఆపగానే అవన్నీ తిరిగి

వచ్చి జొన్న కంకులమీద వాలుతూనే ఉండేవి.

ఒకసారి అతను అట్లా వడిసెలలో పెట్టి విసిరిన రాయి జివ్వుమంటూ పోయి, పొలం చివరన ఉన్న జువ్విచెట్టు గుబురులో పడింది. ఆ జువ్వి చెట్టు గుబుర్లోనే, కొంతకాలంగా ఓ పావురాల జంట నివసిస్తూ ఉంది. రైతు విసిరిన రాయి పోయి తటాలున ఒక పావురానికి తగిలింది.



ఆ దెబ్బకు పాపం ఆ పావురం రక్తం ఓడుతూ, పట్టు తప్పి, క్రింది కొమ్మకు జారి, కొమ్మల గుబురులో చిక్కుకొని, బాధతో రెక్కలు టపటపలాడిస్తూ అరవ సాగింది. దాని ప్రక్కనున్న పావురం కూడా గోలగోలగా అరుస్తూ దాని చుట్టూ తిరగటం మొదలు పెట్టింది.

దూరం నుంచి ఆ సన్నివేశాన్ని చూశాడు పొలం కాపు. వెంటనే మంచె దిగి, పావురాలున్న జువ్వి చెట్టు వైపుకు పరుగెత్తి పోయాడు అతను. గాయపడ్డ పావురం కొద్ది ఎత్తులోనే ఇరుక్కొని ఉన్నది. అయితే ఆ జువ్వి చెట్టు క్రిందే ఒక నాగు పాము పుట్ట కూడా ఉంది! పావురాన్ని అందుకునే తొందరలో ఉన్న కాపు, పుట్ట సంగతి మరచే పోయాడు. ముందు-వెనుక ఆలోచించకుండా, నేరుగా పుట్టను ఎక్కి పావురాన్ని అందుకోబోయాడు!

పుట్టలో పాము నిద్ర పోతున్నది. కాపు కాలు మోపే సరికి ఆ పుట్ట కాస్తా కూలింది. దాంతో బాటు పాముకు నిద్రాభంగం కూడా అయింది! వెంటనే అది కోపంతో బుసలు కొడుతూ బయటికి వచ్చింది. రైతుని చూసి పడగ విప్పి కాటు వేయబోయింది. కానీ దెబ్బతిన్న పావురాన్ని అందుకుంటూ అటు తిరిగి ఉన్న రైతు దాన్ని అసలు చూడనే

లేదు!

అయితే వేదనతో అరుస్తూ అక్కడంతా కలయ తిరుగుతున్న పావురం మటుకు కాటు వేయబోతున్న ఆ పామును చూసింది. చటుక్కున పాము మీదికి దూకింది; దాన్ని కాలి గోర్లతో రక్కుతూ, ముక్కుతో పొడుస్తూ పోరాటం మొదలు పెట్టింది.



ఆలోగా గాయపడిన పావురాన్ని చేతిలోకి తీసుకున్నాడు రైతు. ఆలస్యంగానైనా పాముని, పావురాన్ని చూసాడు. దూరంగా పరిగెత్తాడు. తొందరపాటుతో పుట్టమీదికి ఎక్కటాన్ని తలచుకొని సిగ్గు పడ్డాడు. తనను కాపాడిన పావురం పట్ల అతనిలో కృతజ్ఞత పెల్లుబికింది.

గాయపడిన పావురాన్ని మంచె మీదికి తీసుకెళ్ళి, తనకు తెలిసిన ఆకు పసరులు నూరి కట్టుకట్టి, చికిత్స చేసాడు. కొన్నాళ్లపాటు ఆ పావురాన్ని తన మంచె పైనే ఉంచుకున్నాడు. దాని అదృష్టం బాగుంది- తగిలిన గాయం మానిపోగా, క్రమ క్రమంగా మామూలు స్థితికి వచ్చింది.

ఆ నాటి నుండి పావురాలు నిర్భయంగా అతని దగ్గరికి రావటం, మంచెపై వాలటం మొదలెట్టాయి. పొలం కాపు వాటితో తన కష్ట సుఖాలు చెప్పుకునేవాడు. అవి కూడా ఏవేవో రాగాలు తీస్తూ అతనికి బదులిచ్చేవి. మరి పావురాలు పిట్టలకు ఏం చెప్పాయో గాని, ఆశ్చర్యం- రైతు పొలానికి పిట్టల తాకిడి లేకుండా అయ్యింది!

మంచి మనసుగల వారికి మంచి స్నేహితులు లభిస్తారు. మనం చూపే ప్రేమాభిమానాలను బట్టి వాళ్ళు కూడా మనపై ఆప్యాయతని వర్షింపజేస్తారు. 

# వెంగళప్ప వైనాలు

*తెలుగునాట హాస్యాన్ని పండించినవాళ్లలో ముఖ్యుడు వెంగళప్ప. ఆయన చేసిన ముచ్చట్లు ఎన్ని విన్నా తనివి తీరదు! సేకరణ : మల్లికార్జున, కొత్తపల్లి.*

**I**

వెంగళప్ప ఓసారి స్టేషన్లో నిలబడి ఉన్నాడు- రైలుకోసం ఎదురు చూస్తూ. అంతలో అక్కడే నిల్చొని ఉన్న కుర్రవాడొకడు అడిగాడు-

కుర్రాడు: అంకుల్! టైమెంతయిందంకుల్?

వెంగళప్ప: సారీ!

కుర్రాడు: ఎందుకు అంకుల్, సారీ?!

వెంగళప్ప: నేను చెప్పనయ్యా, టైం ఎంతైందో చెప్పేది లేదు.

కుర్రాడు: అదే సర్, నేను అడుగుతున్నది! ఎందుకు చెప్పరు, అని!

వెంగళప్ప: ఓహో! నీకు కారణంకూడా చెప్పాలా?! సరే అయితే- విను. నేను నీకు ఇప్పుడు టైమెంతయిందో చెప్పాననుకో, నువ్వు కొంచెం సేపు అయ్యాక మళ్ళీ టైం అడుగుతావు. ఆ తర్వాత నా పేరు అడుగుతావు. నీ పేరు చెబుతావు. ఆ తర్వాత, మా రైలు రాగానే నువ్వూ అందులోనే ఎక్కుతావు- ఎక్కి నాతో పాటు ప్రయాణం చేసి పరిచయం మరింత పెంచుకుంటావు. ఆ తర్వాత మా స్టేషను వచ్చినప్పుడు నాతోబాటు నువ్వూ దిగుతావు. అక్కడ నన్ను రిసీవ్ చేసుకునేందుకు మా అమ్మాయి వచ్చి ఉంటుంది. మా అమ్మాయి చాలా అందంగా కూడా ఉంటుంది; దాంతో నువ్వు మా అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని అడుగుతావు. మా ఆవిడకి నువ్వు నచ్చుతావు; దాంతోమీరంతా నామీద ఒత్తిడి తెస్తారు- అయినా నేను ఒప్పుకునేది లేదు- ఎందుకంటే నువ్వు ఏమాత్రం ముందుచూపు లేని వాడివి-

కుర్రాడు: అట్లా ఎందుకంటారంకుల్?! మీరెలా-

వెంగళప్ప: నువ్వింకేమీ మాట్లాడక్కర్లేదు నాయనా, నీ చేతికి గడియారం లేదనగానే నాకు నీ గురించి మొత్తం తెలిసిపోయింది- నేను మాత్రం ఈ పెళ్ళికి ఒప్పుకునేది లేదుగాక లేదు!

(కుర్రాడు మూర్ఛపోయాడు)

**II**

ఒకసారి ఓ వెంగళప్ప పని కోసం వెతుక్కుంటూ ఇల్లిల్లూ తిరగసాగాడు- "అయ్యా! నాకు ఏమైనా పని ఉంటే ఇవ్వండయ్యా. ఇంతకు ముందు వేరే ఇంట్లో పనోడిగా చేశాను" అంటూ.

ఆ వీధిలో ఒక ఇంటి యజమానికి పనివాడి అవసరం ఉంది. ఆయన వెంగళప్ప కేసి ఎగాదిగా చూసి అడిగాడు- "ఇంతకు ముందు వాళ్ళు నిన్ను ఎందుకు పనిలోనుండి తీసేశారు?" అని.

"అయ్యా, అదే నాకు అర్థం కాలేదయ్యా" చెప్పాడు వెంగళప్ప- "మా యజమాని ఒకసారి 'కాళ్లు నొప్పి, కాళ్లునొప్పి' అన్నాడయ్యా. నేను ఆయన కాళ్లు పిసికాను. బాగుందన్నాడు. మళ్ళీ ఒకసారి 'భుజం నొప్పి, భుజం నొప్పి' అన్నాడయ్యా. నేను వెళ్ళి భుజాలు నొక్కాను; 'చాలా బాగుందిరా' అని మెచ్చుకున్నాడు. తర్వాత ఇంకోసారి 'నడుము నొప్పి, నడుమునొప్పి!' అని మొత్తుకున్నాడయ్యా; సరేనని నేను నడుము పిసికాను. 'బలే ఉంద'ని మెచ్చుకున్నాడయ్యా. తరువాత కొన్ని రోజులకు 'మెడ నొప్పి మెడనొప్పి' అన్నాడయ్యా. 'దానిదేముంది' అని నేను..

ఇంటి యజమాని తెరిచిన నోరును తిరిగి మూయలేదు.

చిలిపి ప్రశ్న: దీపం కొండెక్కాలంటే ఏం చేయాలి?



తిక్క సమాధానం: కొండెక్కించాలి.

*-నాగ తరుణ్, 6th, వికాస విద్యా వనం*

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**రామచిలుక, నిమ్మకాయ, ఆటలు, ఎనిమిది, మహారాజా, నిధులు, సలహాదారు, ఎగతాళి, అటువైపు, గొడ్డలి, గొడవలు, వినవద్దు, అనవద్దు, కనవద్దు, అడుగులు, పదాలు, ఎందుకు, నేతగాడు, మనుమడు, పిల్లవాడు :-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మ | ద్దు | ఆ | ని | ధు | లు | అ | పి | జా | మ | డ | రా |
| ద్దు | వ | ట | మ్మ | బొ | మ్మ | లి | మ | రా | ద్ది | మ | జ |
| ప | న | చి | కా | ర | వ | డ్డ | ళి | ను | చి | ప | స |
| ర్ర | క | తా | య | ద్దు | ర | తా | దా | లు | మ | లు | క |
| కా | య | జా | తా | ద్దు | గ | నే | క | అ | గు | డు | ఎం |
| మ | హా | రా | ది | ఎ | గా | చి | త | డు | టు | గం | దు |
| ఎం | మి | హా | పు | నే | ని | గా | అ | గా | హా | వై | కు |
| చి | మి | మ | లు | రు | గొ | మి | వై | లు | డు | మ్మ | పు |
| పి | లు | లు | దా | ప | ద్దు | డ్డ | ది | లు | లు | ట | ఆ |
| క | ల్ల | హా | ప | మ్మ | వ | చి | ని | వ | బం | కా | కు |
| న | ల | వా | ద్దు | వ | న | అ | ధు | డ | గా | ధు | ప |
| స | గ | ళి | డు | డు | వి | లి | డ్డ | గొ | రం | రం | దు |

మీ గ్రహణ శక్తిని పెంచుకునేందుకు ఇదో చక్కని అభ్యాసం!

# డొనాల్డ్ ట్రంప్

**తెలుసుకుందాం**



నాలుగేళ్ల కొకసారి జరిగే అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో రిపబ్లికన్ అభ్యర్థి డొనాల్డ్ ట్రంప్ అనూహ్యంగా విజయం సాధించి, అమెరికాకు నలభై ఐదవ అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు.

డెభ్భై సంవత్సరాల ట్రంప్ ప్రధానంగా రియల్ ఎస్టేట్ వ్యాపారి. అనేక ఆకాశ హర్మ్యాలు, జూదశాలలు, రిసోర్ట్‌లు, గోల్ఫ్ క్రీడాంగణాలు నిర్మించిన ట్రంప్, తరువాతి కాలంలో హోటల్ వ్యాపారంలోకి, మంచి నీళ్ల వ్యాపారంలోకి, ట్రంప్ యూనివర్శిటీ ద్వారా విద్యా వ్యాపారంలోకి, చివరికి విమానరంగంలోకి కూడా ప్రవేశించాడు. అమెరికాలోని అత్యంత ధనికులలో డొనాల్డ్ ట్రంప్‌ది 113 వ స్థానం.

"అమెరికాకి పూర్వ వైభవం" అనే నినాదంతో అధ్యక్షుడిగా ఎన్నికైన డొనాల్డ్ ట్రంప్ విధానాలు అమెరికన్ల మీదే కాక మిగిలిన ప్రపంచ దేశాల మీద కూడా అమితమైన ప్రభావం చూపనున్నాయి.

'అమెరికాలో పెరిగిన నిరుద్యోగానికి బయటిదేశాలనుండి వచ్చిన వలస దారులే కారణం' అని నమ్మే ట్రంప్, విదేశాలనుండి అమెరికాలో పనిచేసేందుకు, చదువుకునేందుకు వెళ్ళిన/ వెళ్దామనుకుంటున్న ఔత్సాహికుల ఆశలపై నీళ్లు కుమ్మరిస్తున్నాడు. ట్రంప్ నిర్ణయాల నేపథ్యంలో మన యువతరం కూడా తన "డాలర్ డ్రీమ్స్" ని ఒట్టి 'డ్రీమ్స్' గానే ఉంచుకోవాల్సి రావచ్చని విశ్లేషకుల అంచనా.

ప్రపంచ వ్యాప్తమైన తీవ్రవాదానికి ముస్లింలను బాధ్యుల్ని చేస్తూ ట్రంప్ తీసుకుంటున్న నిర్ణయాలు అనేక దేశాలను కలవరపెడుతున్నాయి. తాజాగా ఏడు ముస్లిం దేశాలు- ఇరాక్, ఇరాన్, సిరియా, సోమాలియా, సూడాన్, లిబియా, యమన్-ల నుండి "ఎవ్వరూ అమెరికాకు వలసపోయేందుకు

వీల్లేదు" అని ట్రంప్ తీసుకున్న నిర్ణయం ప్రపంచ దేశాలన్నింటిని ఒక కుదుపు కుదిపింది.

"అమెరికాలో తయారు చేయండి; లేదా భారీ మూల్యం చెల్లించుకోండి!" అంటూ కార్ల కంపెనీలకు ట్రంప్ చేసిన హెచ్చరికల ఫలితంగా "మెక్సికోలో చవకగా కార్లు తయారు చేసి అమెరికాలో లాభానికి అమ్ముకుందాం" అనుకున్న కంపెనీలు కష్టాలపాలయ్యాయి.

ప్రధానంగా అమెరికా మీద ఆధారపడిన మన ఐ. టి. రంగానికి ప్రస్తుతం ట్రంప్ ఎన్నిక పెద్ద దెబ్బే కావచ్చు.

## పి వి సింధు



2016 రియో-డి-జెనిరో ఒలింపిక్స్‌లో షటిల్ బాడ్మింటన్ క్రీడలో రజత పతకం సాధించిన పూసర్ల వెంకట సింధు అచ్చమైన మన తెలుగు బిడ్డ. ఇరవై ఒక్క ఏళ్ల సింధూను 2015 లోనే భారత ప్రభుత్వం పద్మశ్రీ ఇచ్చి గౌరవించింది.

సింధు వాళ్ల అమ్మా నాన్నలు వాలీబాల్ ఆటగాళ్లు. వారి ప్రోత్సాహంతో సింధు చిన్నప్పటి నుండి షటిల్ బ్యాడ్మింటన్ నేర్చుకోవటం మొదలుపెట్టింది. ప్రసిద్ధ ఆటగాడు గోపిచంద్ హైదరాబాద్‌లో నిర్వహించే అకాడమీలో చేరి, ఆమె బ్యాడ్మింటన్‌లోని మెళకువలు సాధన చేసింది. అకాడమీ సింధు వాళ్ల ఇంటి నుండి యాభై ఆరు కిలోమీటర్ల దూరంలో ఉండేదట! అయినా ఆమె క్రమం తప్పకుండా రోజూ ఆట నేర్చుకునేందుకు వెళ్లేది.

'క్రీడలంటే మక్కువ, ఏదైనా సరే నేర్చుకోవాలనే పట్టుదల ఉన్న పిల్లలకు సరైన ప్రోత్సాహం, మంచి శిక్షణ అందిస్తే వారు దేన్నైనా సాధిస్తారు' అని సింధు ఋజువు చేస్తున్నది.

# పదరంగం-89

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | ★ |
| | ★ | | ★ | 4 | 5 |
| 6 | 7 | ★ | 8 | | |
| 9 | | | ★ | 10 | |
| | ★ | ★ | 11 | ★ | |
| 12 | | | | | |

**అడ్డం:**

1. మన దేశ ప్రధాని (5)

4. మనం పాడేది (2)

6. అడవికి రాజు (2)

8. తిరగ బడిన పావనం (3)

9. గజిబిజిగా సహజం (3)

10.తిరగబడ్డ కాళి (2)

12.'మిర్చి' కి బహువచనం (6)

**నిలువు:**

1. సగం సింహం, సగం మనిషైన దేవుడు (6)

2. తల క్రిందులైన ఇంద్ర (2)

3. దీపాల పండుగ (4)

5. దీపాల పండుగ రోజున కాల్చే కాయలు (5)

7. ఈ పక్షి పాలను నీళ్లను వేరు చేస్తుందట! (2)

11. బంగ్లాదేశ్ రాజధాని (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.

సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 91 ని బహుమతిగా పంపిస్తాం!

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా ఇప్పుడు కొత్తపల్లికై డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి:

**http://www.instamojo.com/kottapalli**

**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:

వ్యక్తులకు: **300/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

సంస్థలకు: **350/-**

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.



కొత్తపల్లి పుస్తకానికి చందా కట్టే బడులు/గ్రంధాలయాల వారు బ్యాంక్ అక్కౌంటులో జమ చేయాలని మనవి. ఆన్‌లైన్ చందా సౌకర్యం కేవలం వ్యక్తులకు మాత్రమే. సంస్థలకు: 350/- వ్యక్తులకు: 300/-

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBHY0020902

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్సుఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 set | 9 | 15 | 180 |
| 2 | 2012 Set | 11 | 20 | 220 |
| 3 | 2013 Set | 7 | 16 | 175 |
| 4 | 2014 Set | 10 | 448 | 250 |
| 5 | 2015 Set | 7 | 1090 | 175 |
| 6 | 2016 Set | 8 | 1475 | 200 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 01/02/2017 Postal Regn No: HDP/008/2015-2017

## ఉపాధ్యాయులు పాఠశాలల్లో ఏ విధంగా ఉంటే బాగుంటుంది?

*నవ్వుతూ ఉండాలి. * పిల్లలతో నవ్వుతూ మాట్లాడాలి. *చిన్న పిల్లలు స్పర్శను కోరుకుంటారు. ఆటలాడించాలి.

*పాటలు పాడాలి; గేయాలు చెప్పించాలి. *డ్రాయింగ్ వేయించాలి.

*కొట్టకూడదు. తిట్టకూడదు. *మారు పేర్లు పెట్టి పిలవకూడదు.

*పలకలపై రాసి అరగ దిద్దయ్య కూడదు. * నిలబెట్టి గొంతు పోయేటట్టు అరుపులు అరిపియ్య కూడదు

*అర్థమయ్యే గేయాలు చెప్పించాలి * నవ్వించే మాటలు మాట్లాడాలి

*ఆరు బయట తీసుకు వొచ్చి ప్రకృతినంతా చూయించాలి * పాఠ్యపుస్తకమే ఎప్పుడూ చెప్పకూడదు

*చిన్న చిన్న పనులతో నేర్చుకోవడం అలవాటు చెయ్యాలి * మంచి మంచి పుస్తకాలు చదివే అలవాటు కలిగించాలి

*రకరకాల పుస్తకాలు క్లాసులికి తీసుకువొచ్చి చూయించాలి * హావభావాలతో కథలు చెప్పించాలి

*కథలు చెప్పిన తరువాత కథలో పాత్రలతో యాక్షన్ చేయించాలి

* మంచి మంచి పాటలు వినిపించాలి * సందేశాత్మకమైన సినిమాలు చూయించాలి

* స్కూల్ ఆవరణలో సిగిరెట్లు తాగకూడదు * ఉపాధ్యాయులు తిట్టుకోకూడదు

* అందరూ కలిసి మెలిసి ఆనందంగా ఉండాలి

* బడి టైములో పిల్లలు, బడి, పాఠాలు, చదువు గురించే మాట్లాడుకోవాలి * తెలియని విషయాలు తెలుసుకొని చెప్పాలి * మొక్కలు నాటడం అలవాటుగా చెయ్యాలి

*అవసరమైన వారికి తాము సహాయం చేస్తూ పిల్లలకు కూడా అలవాటు చెయ్యాలి * ధైర్యం కలిగించే మాటలు చెప్పాలి * పిల్లల్లో అద్భుతమైన శక్తులున్నాయనే విషయం వాళ్ళకు అర్థమయ్యేట్టు చెప్పాలి * 'పిల్లలు ఏమైనా చెయ్యగలరు' అని వాళ్ళకు అర్థమయ్యేలా చెప్పాలి




* ఓర్పు, సహనం కలిగి ఉండాలి * పిల్లలు చేసే అల్లరిని అర్థం చేసుకోవాలి * వాళ్ళు చేసే ప్రతి మంచి పనినీ విసుక్కోకుండా అలా చెయ్యకూడదని చెప్పాలి * ఏడ్చేటప్పుడు అరవకుండా విషయం తెలుసుకొని పరిష్కరించాలి. * అవసరమైనప్పుడు మంచి మాటలు చెప్పి పిల్లల్ని ఓదార్చాలి * అసలు నిజంగా పిల్లల సమస్యలేమిటో తెలుసుకోవాలి * ఇబ్బందులు తెలుసుకొని పరిష్కరించాలి * గ్రూపులు చేసి చదువుకోమని చెప్పాలి * మనం స్కూల్ వర్క్ చేసుకుంటుంటే పిల్లలకు వర్క్ ఇచ్చి చెయ్యమనాలి * తరగతిలో వీలైనంత వరకు నిలబడి పాఠం చెప్పాలి.... ఈ పెద్ద లిస్టులో ఎన్ని చేస్తుంటారు, మీరు?

"బడి ఎలా ఉంది, ఏం చెయ్యాలి, ఎలా చెయ్యాలి, ఎవరు చెయ్యాలి?" అని ఆలోచిస్తున్నారా?



"KOTTAPALLI" Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.